



### సంపాదక వర్గం

సంపాదకుడు :
లయన్ కె.వి. గోవిందరావు,
బి.ఎ.,ఎల్ ఎల్.బి.
గౌరవ సహాయ సంపాదకులు :
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు,
ఎమ్.ఎ., విద్వాన్
వి. బాలకుమార్, ఎమ్.ఎ.,బి.ఎల్
సభ్యులు :
కె.వి.ఎస్. గోవిందరావు,
బి.ఎ.,ఎల్ ఎల్ బి
కె.వి.ఎస్. శరత్ బాబు,
బి ఎ.,బి కామ్ .బి ఎల్
కె.వి.ఎస్. విజయకుమార్
కె రత్నకుమారి


### చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |


చందాలు పంపవలసిన చిరునామా :

**విస్డమ్**

9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు-600 004


# ఈ సంచికలో

## డిసెంబరు 1984





ముఖచిత్రం-కలర్ ట్రాన్స్పరెన్సీ :
శ్రీ యోగా, మద్రాసు-17.

**తెలుగు 'విస్డమ్'కు ఇది మూడవ సంవత్సరం**

## ధ్యానం

### 'చెడు' 'మంచి'కి ఉపదేశా లివ్వ లేదు!



జేమ్స్ ఎలెన్

స్వార్థ పర జీవితాన్ని వదలి బంధ విముక్తు డైన వ్యక్తి వెనక్కి తిరిగి చూసుకుంటే - ఆ నాడు 'చెడు' తనకు గురువై దానిని అధిగమించేందుకు తోడ్పడడం కనిపిస్తుంది. కాని, ఒక సారి దానిని దాటి వచ్చిన తరువాత అది ఇంక ఉపదేశా లివ్వ లేదు. దిగువ ఉన్న వారు పైన ఉన్న వారికి ఎలా ఉపదేశించ గలరు? 'అజ్ఞానం' 'వివేకానికి', 'చెడు' 'మంచికి'. 'విద్యార్థి' 'గురువు'కీ ఉపదేశాలు ఇవ్వగలగడం అసంభవం! తన పరిధిలో ఉన్నంత వరకే 'చెడు' ఉపదేశిస్తుంది. ఆ పరిధిని దాటి 'మంచి' పరిధిలోకి ప్రవేశిస్తే అక్కడ 'చెడు' పెత్తనం సాగదు. ●

## సంపాదకునిపే

### జీవితం పువ్వు లాంటిది!



కొన్ని ఏళ్ళ అనంతరం తిరిగి మీరు మీ స్నేహితుణ్ణి కలుసుకున్నా రనుకోండి. అతనిలో ఎంతో మార్పు మీకు కనిపిస్తుంది. వెనుకటి కంటె అతడు లావెక్కి ఉండవచ్చు; లేదా చిక్కిపోయి ఉండవచ్చు; వెనుకటి కంటె ఛాయగా కనిపించవచ్చు; లేదా

---

### ప్రజలలో ఎక్కువ మందికి టీ.వీ. సెట్‌లు ఉన్న దేశం

జపాన్‌లో 98 శాతం ఇళ్ళలో కలర్ టీ.వీ. కనిపిస్తుంది. అమెరికాలో 89 శాతం ఇళ్ళలో మాత్రమే టీ.వీ. ఉంది. అమెరికాలో సగటున ప్రతి కుటుంబం రోజుకి గం. 6 ల, ని. 43 ల కాలం మాత్రమే టీ.వీ. ముందు గడిపితే, జపాన్‌లో గం 8 ల, ని. 15 లు రోజూ ప్రజలు టీ వీ. చూస్తారు.

---

"మననం చేయని చదువు జీర్ణం కాని ఆహారం లాంటిది!" —ఎడ్మండ్ బర్క్

కొంచెం నల్లబడ్డట్టు తోచవచ్చు. మెరుగో, తరుగో-ఏదో ఒకటి అతనిలో కనిపిస్తుంది. అంతే గాని అచ్చంగా వెనుక మీరు చూసినట్టు గానే అతడు ఉండడు.

బాగా చిన్నప్పుడూ, స్కూల్లో చదువుకుంటున్నప్పుడూ, పెద్ద అయిన తరువాతా మీరు తీయించుకున్న ఫొటోలు పక్క పక్కన పెట్టి చూసుకోండి. ఎన్నెన్నో జ్ఞాపకాలను ఆ ఫొటోలు మీలో రేపుతాయి. చిన్నతనం, విద్యార్థి జీవితం, వయస్సు వచ్చిన తరువాతి జీవితం ఎలా గడిచాయో ఆ కథలన్నీ అవి మీకు చెబుతాయి. ఆ నాడు మీరు ఎలా ఉండేవారో, ఈ నాడు ఎలా ఉన్నారో అవి స్పష్టం చేస్తాయి. మీకు తెలియకుండానే మీలో వచ్చిన మార్పు చూసి మీరు ఆశ్చర్యపోతారు.

యౌవనం, వార్ధక్యం; సుఖం, దుఃఖం; అభ్యుదయం. పతనం; జీవితం, మరణం - ఇవి భగవంతుని శాసనంలో భాగాలు. మనుష్యుల లోనూ, వస్తువుల లోనూ మార్పు ప్రకృతి సహజం! మన చుట్టూ కనిపించే అన్ని అంశాలూ ఒక మొదలూ, ఒక చివరా ఉన్న సందేశాన్నే మనకు వినిపిస్తాయి!

## బొమ్మలలో హాస్యం

ఇది మీ అమ్మ వంట !




గ్రహాలు, పర్వతాలు, సముద్రాలు, కొన్ని కొన్ని జంతువులు, చెట్లు - అలాంటి వాటి జీవిత ప్రమాణాలతో పోల్చి చూసుకుంటే మనిషి జీవితం క్షణ భంగురమైంది. రాబర్ట్ హెరిక్ అనే కవి మనిషి జీవితాన్ని ఒక పువ్వు జీవితంతో పోలుస్తూ, 'డెఫొడిల్' పూలను సంబోధించి ఇలా అంటాడు:

"మీలాగే మా ఉనికీ క్షణికం
మా వసంతమూ తాత్కాలికం
అతి వేగంగా 'వినాశం' వైపు
మేము సాగుతున్నాం!"

ఒక్కసారి మీరు వెనక్కి తిరిగి చూసుకుంటే రోజులు ఎంత వేగంగా గడిచి పోయాయో, ఎలా రెక్కలు కట్టుకొని ఎగిరి పోయాయో గుర్తించి కవి అన్న మాటలతో పూర్తిగా మీరు ఏకీభవిస్తారు. ఒక్కొక్కప్పుడు 5, 10, 15 సంవత్సరాల కాలం ఇట్టే గడిచిపోయినట్టు అనిపిస్తుంది కాలం, కడలి పొంగూ, వార్ధక్యం, మృత్యువూ ఎవ్వరి కోసం ఆగవు!

ఉన్నవాళ్ళు, లేనివాళ్ళు, రాజులు, పేదలు, పండితులు, పామరులు, బలవంతులు, బలహీనులు-అందరూ పోతారు. మీ మిత్రులలో, బంధువులలో ఎందరో - బహుశః మీ కంటె కూడా దృఢంగా ఉండే వారు-కాల గర్భంలో కలసి పోయారు. జీవితంలో 'నాకు ఎదురేమిటి?' అని విర్ర వీగినవా రెందరో చివరికి చావును ధిక్కరించలేక దాసోహం అన్నారు. ప్రతి నిముషం, ప్రతి గంటా, ప్రతి నెలా, ప్రతి ఏడూ కొంచెం కొంచెంగా మనం మరణిస్తున్నాం. 'జీవితం' ఒడిలో

(మిగతా 60 వ పేజీలో)

## పాత కాపీలు

జనవరి '82, మార్చి '82 నుంచీ ఆగస్టు '82, నవంబరు '82, డిసెంబరు '82; ఫిబ్రవరి '83, మార్చి '83, ఏప్రిల్ '83 మరియు జనవరి '84 నుంచీ జూన్ '84 కాపీలు మా వద్ద ఉన్నవి. 1982 కాపీల వెల రూ. 7-25 లు. 1983 కాపీల వెల రూ. 2-50 లు, 1984 కాపీల వెల రూ. 7 లు. రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 2-75 చేర్చి M.O. పంపాలి. "విస్డమ్", 9 దేశికా రోడ్డు, మద్రాసు-600 004.

—సర్క్యులేషన్ మేనేజర్.

## కలలో పంది కనిపిస్తే....?



టేజాన్ (ద. కొరియా) లని కిమ్‌చన్ బోక్ అనే ఒక పళ్ళ వర్తకుడికి శిథిలావస్థలో ఉన్న తన ఇంట్లోకి ఒక పెద్ద పంది పరుగెత్తు కొచ్చినట్టూ, దాని ముందుకాళ్ళు తను గట్టిగా పట్టుకున్నట్టూ ఒక కల వచ్చింది. తరువాత కొద్ది రోజులకే ఒలింపిక్ లాటరీలో ప్రథమ బహుమతి విజేతగా అతనికి 1,30,719 అమెరికన్ డాలర్ల మొత్తం లభించింది. కలలో పంది కనిపించడం గొప్ప అదృష్ట సూచన అని కొరియన్‌ల విశ్వాసం!

"ఇష్టమయింది చేయడం 'స్వేచ్ఛ'; చేసిందాన్ని ఇష్టపడడం 'సుఖం'!

# సుప్రసిద్ధ సేనానులు

# డగ్లస్ మెక్ ఆరర్

**1950** వేసవి కాలం. ఎండలు మండిపో తున్నాయి. అడపా దడపా వానలు కూడా పడుతున్నాయి ఉ కొరియా తాలూకు కమ్యూనిస్ట్ సైన్యాలు ఐక్యరాజ్య సమితి సేన



జనరల్ మెక్ ఆర్థర్

లను రోజు రోజుకీ సముద్ర తీరం వైపుకి నెట్టివేయసాగాయి. పూసాన్ సమీపంలో ఐక్యరాజ్య సమితి సేనల క్రింద ఉన్న సముద్ర తీర ప్రాంతం నానాటికీ తగ్గుతూంది.

అలాంటి పరిస్థితులలో ఉన్నట్టుండి కొరియాలోని ఐక్యరాజ్యసమితి సుప్రీం కమాండర్ డగ్లస్ మెక్ ఆర్థర్ అతి సాహసంగా శత్రువులకు దిగ్భ్రాంతి కలిగిస్తూ అమెరికన్ మెరీన్‌లతోనూ, పదాతి సైనికుల తోనూ కూడిన ఒక యుద్ధ దళాన్ని దింపాడు. పూసాన్ బీచ్ హెడ్‌కి 200 మైళ్ళు ఉత్తరంగా ఇన్‌ఛాన్ వద్ద దిగింది ఆ దళం.

అలాంటి పరిణామాన్ని ఊహించి ఉండని ఎర్ర సైన్యాలను ఎదిరించి తేలికగా ఆ దళం ముందుకు చొచ్చుకు పోసాగింది. కొద్దిరోజుల లోనే కమ్యూనిస్ట్ సేనల సరఫరా మార్గాలు బంద్ చేశారు. పూసాన్ హెడ్ బీచ్ వద్ద ఉన్న తమ సేనలను కలుసుకొని ఎర్రసేనలను 38 వ సమాంతర రేఖ పై భాగందాకా తరిమి తరిమి కొట్టారు.

ఆ తరువాత రెండు నెలలకు మెక్ ఆర్థర్ ఉ. కొరియా, మంచూరియాల సరి

## సవరణ

నవంబరు '84 సంచిక 8 వ పుట దిగువ బాక్సు శీర్షికలో 'శత దినోత్సవం' అన్న మాటను 'శత వార్షికోత్సవం' అని సవరించు కొనవ ప్రార్థన. అచ్చుతప్పు దొర్లినందుకు చింతిస్తున్నాం. ఈ పొరపాటును మా దృష్టికి తెచ్చిన పాఠకులకు కృతజ్ఞులం!

—సంపాదకుడు

"ఏ సూత్రానైనా 'అతి' గా అమలు జరిపితే ఆ 'పాలన' కొనసాగదు." —మాం టెస్క్యూ

హద్దు మీదికి ఐక్యరాజ్య సమితి సేనలను పంపాడు. కాని ఆ సరిహద్దు రక్షణకోసం చైనా కమ్యూనిస్టులు వేలకొద్దీ సైనికులను దింపారు. దానితో అమెరికన్ సేనలూ, వారికి అండగా నిలిచిన ఐక్యరాజ్య సమితి సేనలూ తిరుగుముఖం పట్టి వందల కొద్దీ మైళ్ళు వెనక్కు తగ్గి, 38 వ సమాంతర రేఖకు బాగా దిగువకు తిరోగమించవలసి వచ్చింది.



అమెరికన్ సైనికుడు

ఆశ్చర్యకరమైన విజయాలూ, అతి ఘోరమైన పరాజయాలూ - రెండూ చవి చూసిన మెక్ ఆర్థర్ సేనాని నిర్ణయాలు ఎన్నో సార్లు వాదోపవాదాలకు గురి అయాయి. రెండవ ప్రపంచ యుద్ధం నాటి మహా సేనానులలో ఒకడైన అమెరికన్ సేనాని మెక్ ఆర్థర్ శారీరకంగానూ, నైతికంగానూ కూడా గొప్ప బలశాలి. ఆయన ప్రజ్ఞ, ఆయన నాయకత్వ నైపుణి, ఆయన పరిపాలన దక్షత చెప్పుకోదగ్గవి. స్వల్పంగా అహంభావం, ఆడంబరం కూడా ఆయనలో కనిపించేవి. కొట్టొచ్చినట్టు కనిపించే భారీ విగ్రహంతో నిటారుగా నడుస్తూ ఎంత వయస్సు వచ్చినా యువకుడి లాగ ఆయన కనిపించే వారు!

1880 జనవరి 26 న అర్కాన్సాస్ రాష్ట్రంలోని 'లిటిల్ రాక్' లో మెక్ ఆర్థర్ జన్మించారు. వెస్ట్ పాయింట్ వద్ద 'యు.ఎస్. మిలిటరీ అకాడమీ' లో 4 ఏళ్ళు చదివి. 98.14 రికార్డు మార్కులతో 1903 లో ఆయన పట్టభద్రు లయారు.

'ఆర్మీ ఇంజనీర్స్' దళంలో రెండవ లెఫ్టినెంట్ గా ఆయనను నియమించారు. ఫిలిప్పీన్

## భావపరిచయ పోటీ

(అక్టోబరు - 1984)

"యంత్ర శక్తి కన్న
స్వశక్తి మిన్న!"

—కె.జి. నందగోపాల్,
ఆళ్లగడ్డ (కర్నూలు జిల్లా).

* * *

కష్టపడితేనే ఆరోగ్యం—
సుఖాలు మరిగితే అనారోగ్యం!

—బి.హెచ్. పద్మిని,
భట్టిప్రోలు (గుంటూరు జిల్లా).

* * *

"ఒంటికి కావాలి ఎక్సర్ సైజు
లేకుంటే పెరుగుతుంది దాని సైజు!"

—ఎమ్.ఎస్. మూర్తి,
నెల్లుంట్ల (వరంగల్ జిల్లా).

" 'కోపం' ఆవహిస్తే 'విచక్షణ' జ్ఞానం దూరం అవుతుంది." —థామస్ ఫ్యుల్లర్

దీవులలో అమెరికన్ పాలనను ప్రతిఘటిస్తూ దేశీయులు జరిపిన విప్లవాన్ని అణచివేయ వలసి వచ్చిన సందర్భంలో ఎన్నో సార్లు కొద్దిలో ఆయనకు మృత్యువు తప్పింది. ఒక సారి గాయపడ్డ ఒక సైనికునికి సాయం

HARRY S TRUMAN



చెయ్యడానికి ఆయన ముందుకు వంగారు. సరిగా ఆ క్షణంలోనే ఒక గుండు వచ్చి ఆయన తలమీద టోపీని దూసుకుపోయింది. ముందుకు వంగకుండా నిటారుగానే నిలిచి ఉంటే ఆ నాడే ఆయన జీవితం అంతమై పోయి ఉండేది.

మొదటి ప్రపంచ సంగ్రామంలో ఫ్రాన్స్‌లో పోరాడిన సుప్రసిద్ధమైన 'రెయిన్ బో (ఇంద్ర ధనుస్సు) డివిజన్' కు మెక్ ఆర్థరే అధిపతి. కర్నల్‌గా ఉంటూ ఆ పోరాటంలో రెండు సార్లు ఆయన గాయ పడ్డారు. తుపాకీ గుండ్ల వర్షాన్ని ఎదుర్కోడంలో ప్రదర్శించిన ధైర్య సాహసాలకు గాను 13 సార్లు ఆయన ప్రశంసా పతకాలు అందు కున్నారు.

1935-37 మధ్య ఫిలిప్పీన్ ప్రభుత్వానికి సైనిక సలహాదారుగా ఉంటూ ఆ దేశం రక్షణ ఏర్పాట్లను మెక్ ఆర్థర్ పటిష్ఠం చేశారు. 1941లో అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ దూర ప్రాచ్యం లోని అమెరికన్ సేన లన్నిటికీ కమాండరుగా ఆయనను నియమించారు.

1941 లో జపాన్ వారు ఫిలిప్పీన్ దీవుల మీద దండెత్తివచ్చినప్పుడు తగినంత ధైర్యంగా పోరాడి బాటాన్ ద్వీప కల్పాన్నీ, కొరెజిడోర్‌నీ మెక్ ఆర్థర్ కాపాడలేక పోయారు. ఆ ప్రాంతంలోని అమెరికన్ సేనలు 1942 ఏప్రిల్, మే నెలలలో జపాన్ వారికి లొంగి పోయాయి. తప్పించుకొని ఆస్ట్రేలియా చేర వలసిందని మెక్ ఆర్థర్‌కు ఆదేశాలు వచ్చాయి. అక్కడ నైరృతి పసిఫిక్ మిత్ర రాజ్య సేన

## క్రికెట్‌లో సాధించిన అపూర్వమైన ఫీట్

రెండు ఇన్నింగ్స్‌లలోనూ సెంచరీలు కొట్టడమే కాక, అదే పోటీలో మూడు బంతులలో వరుసగా ముగ్గురు ఆటగాళ్ళను ఔట్ చేయడం అనే అపూర్వమైన ఫీట్ చేసినవాడు మైక్ ప్రోక్టర్. గ్లౌసెస్టర్ కౌంటీ జట్టు పక్షాన ఆడుతూ 1972 లో ఎసెక్స్‌కి వ్యతిరేకంగానూ, 1979 లో లైసెస్టర్ జట్టుకి వ్యతిరేకంగానూ రెండుసార్లు ఆయన ఈ ఫీట్ సాధించారు.

"ఆత్మలో మూడు భాగాలు: తెలివి, ఆవేశం, విచక్షణ. మొదటి రెండూ సర్వజంతు సామాన్యాలు; మనిషిలో విశేషం అతని 'విచక్షణ'!" — పైథాగరాస్

లకు నాయకుడుగా నియమించబడి, కొంత మెరుగుగా ఆయన ఆ సేనలను నడిపారు.

1942 చివరలో జపాన్ ఆక్రమించుకున్న దేశాలను పునరాక్రమించుకునే పోరాటాలను కూడా ఆయనే నడిపారు. న్యూ గినియా, న్యూ బ్రిటన్, ఫిలిప్పీన్ దీవులలో ప్రతిభా వంతంగా సైన్యాలను నడిపి ఆయన ఘన విజయాలను సాధించారు జపాన్ సామ్రాజ్యం చివరకు దాసోహం అనేట్టు చేయడంలో మెక్ ఆర్థర్ ప్రధాన పాత్ర నిర్వహించారు. 1945 సెప్టెంబర్ 2 న 'మిసోరీ' అనే యుద్ధ నౌక మీద జపాన్ వారి 'శరణాగతి' (surrender) ని ఆయనే స్వీకరించారు. మెక్ ఆర్థర్ క్రింద పని చేసిన ఆఫీసర్లు ఆయనను 'అపర అలెగ్జాండర్'గా భావించి ఆరాధించేవారు.

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత అయిదేళ్ళ పాటు అమెరికా వారు జపాన్‌లో ఏర్పాటు చేసిన సైనిక ప్రభుత్వ ప్రధాన పాలకుడుగా మెక్ ఆర్థర్ పని చేశారు. ఆ రోజులలో జపాన్ ప్రజలలో ప్రజాస్వామ్య భావాలను వెదజల్లడం ఆయన ప్రధాన ధ్యేయంగా పెట్టుకున్నారు. ఆ ధ్యేయాన్ని సాధించడానికి చిత్రంగా ఆయన నియంతృత్వ విధానాలు అవలంబించి, అత్యద్భుతమైన ఫలితాలు సాధించారు. ప్రజారోగ్యం, విద్యా బాగా పెంపొందించి, చాలా వరకు ప్రజాస్వామికం అనదగిన ప్రభుత్వాన్ని అక్కడ నెలకొల్పారు.

1950 జూన్ 24 న ఉ. కొరియా తాలూకు కమ్యూనిస్ట్ సైన్యాలు ద. కొరియా మీద దండయాత్ర సాగించినప్పుడు ఆ దురాక్రమణను అరికట్టడానికి ఐక్యరాజ్య సమితి పంపిన సేనలకు మెక్ ఆర్థర్ నాయకత్వం వహించారు. 1951 ఏప్రిల్ 11 న ఆ పదవి నుంచే గాక, ఆయనకు గల అన్ని సైనిక పదవుల నుంచీ బర్తరఫ్ చేసి అధ్యక్షుడు ట్రూమన్

(మిగతా 61 వ పేజీలో)

## శ్రద్ధాంజలి



దుండగుల తుపాకి గుళ్ళకు
గురియై భారత జాతిని దుఃఖ
సాగరంలో ముంచి పోయిన
మన ప్రియతమ నాయకురాలు
ఇందిరా గాంధీ
విషాద స్మృతికి 'విస్‌డమ్'
తన ప్రగాఢ సంతాపాన్ని
తెలుపుతూంది. —సంపాదకుడు

"ప్రజలు గొర్రెల మందలాగ ఉండే రాజ్యం ప్రజాస్వామ్యం అనిపించుకోదు." -గాంధీ

# జీవితంలో 'ప్రతీక'ల ప్రాధాన్యం

శ్రీ ఆర్. కె. మూర్తి

తెలియని దాన్ని తెలిసేట్టు బోధించడానికీ, అమూర్త (abstract) వస్తువులను కళ్ళకు కట్టినట్టు ప్రదర్శించడానికీ ప్రతీకలు



(symbols) ఉపయోగపడతాయి. నిజానికి ప్రతీకలు లేకుండా జీవించడం కష్టం. చివరికి- మనం మాట్లాడే భాష కూడా ప్రతీకలతో - గుర్తులతో - కూడిందే! ఇక క్షేత్ర గణితం (geometry) అనే గణితశాస్త్ర శాఖ పూర్తిగా ప్రతీకల మీదే ఆధారపడి ఉంది.

విజ్ఞాన శాస్త్రంలోనే ప్రతీకలు అవసరం అయితే, మతం విషయంలో అవి మరింత తప్పని సరి! దేవుడు, మనిషి, సృష్టి, విధి, మంచి చెడ్డల సమస్య వంటి విషయాలను గూర్చి చర్చించే మతం అమూర్త భావాలను విస్పష్టంగా నిరూపించా లంటే ప్రతీకలు వాడక తప్పదు.

ప్రణవం - అంటే 'ఓమ్' - హిందూ మతంలో ముఖ్యమైన ప్రతీక. 'ఓమ్' సంస్కృత పదం. ఈ జగత్తు నంతా శాసించే అద్భుత శక్తికి అది సంకేతం! ఈ విశ్వాన్ని నడిపే ఆ అద్భుత శక్తి దేవుడే గనుక 'దేవుడు', 'ఓమ్' ఒకటే! పరబ్రహ్మకు సర్వోత్కృష్టమైన ప్రతీక 'ఓమ్'.

'ఓమ్' లో మూడు వర్ణాలు ఉన్నాయి: అ,ఉ, మ్ ఆ మూడు వర్ణాలకూ వేర్వేరు అర్థాలు ఉన్నాయి. 'అ' అంటే 'సృష్టి' 'ఉ' అంటే 'స్థితి'; 'మ్' అంటే 'లయం' (ప్రళయం). అందుచేత-సృష్టి, స్థితి, లయాలు అనే ఈ మూడు పనులనూ నిర్వర్తించే పరమాత్మే 'ఓమ్'!

వేదాలు 'ప్రణవం' (ఓమ్) మాహాత్మ్యాన్ని చాటుతున్నాయి. ఉపనిషత్తు లన్నీ 'ఓమ్' పర

---

## 1983 'రామ్ నారాయణ్ వైద్య' అవార్డు

1983 'రామ్ నారాయణ్ వైద్య అవార్డు'ను ఆయుర్వేదంలో ఆయన చేసిన అద్భుతమైన పరిశోధనలకు గుర్తింపుగా వైద్య శ్రీహరిదత్త శాస్త్రికి ఇచ్చారు. లక్ష రూపాయల నగదును, ఒక శాలువను ఆయనకు బహూకరిసారు.

"తీర్పు చెప్పేటప్పుడు ఓర్పు అవసరం!
మనలో ఎవ్వరం అపరాధం చేయకుండా లేము!" - షేక్స్పియర్

బ్రహ్మ స్వరూపమే అంటున్నాయి. భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు "పదాలలో 'ఓమ్' అనే పదాన్ని నేను" (అధ్యా. 10-శ్లో 25) అని ప్రకటించాడు. 'ఓమ్' కారంతోనే



హిందువులు మత కర్మ కాండ లన్నీ ప్రారంభిస్తారు.

వివేకానంద స్వామి 'అ' కారం నాలుక లోనూ, నోటిలోని వివిధావ యవాలలోనూ ఎలాంటి వికారం లేకుండా ఉచ్చరించే మూల స్వరం అనీ, 'ఉ' కారం నోటి మూలం నుంచి కొస దాకా గుండ్రంగా తిరుగుతూ వెలువడే స్వరం అనీ, 'మ్' పెదవులు రెండూ మూసి ఉచ్చరించే చరమ ధ్వని అనీ - ఈ విధంగా మొత్తం వర్ణమాల కంతటికీ ఇది సంకేతం అనీ వ్యాఖ్యానించారు.

బౌద్ధుల ప్రతీక 'ధర్మ చక్రం'. గౌతము డనే రాకుమారుడు తన 29 వ ఏట సంసారం వదలి అడవులకు పోయి తపస్సు చేసి గయ సమీపంలో ఒక బోధి వృక్షం క్రింద ఆత్మ సాక్షాత్కారం పొంది, 'బుద్ధుడు' అయాడు. వెంటనే వారణాసి వెళ్ళి ఆ సమీపంలోని సారనాథ్‌లో 5 గురు శిష్యులకు తన తొలి ఉపదేశం అందజేశాడు వేదనా తప్తులైన మానవ



కోటికి ఆధ్యాత్మిక సుధను పంచిపెడుతూ ఆయన ఆ రోజున ప్రారంభించిన ధర్మ ప్రబోధన వ్యాసంగమే 'ధర్మచక్ర ప్రవర్తన' అయింది. 'ధర్మం' అంటే మంచి చేయడం.



ధర్మ చక్రాన్ని కదలించడమే 'ధర్మచక్ర ప్రవర్తనం'.

ధర్మ చక్రానికి 8 ఆకులు. సమ్యగ్ దృష్టి,

---

"తాబేలు నీటిలో ఉన్నా దాని మనస్సు ఒడ్డున ఉన్న గుడ్ల మీదే!
అలా మన మనస్సును నిరంతరం దేవుని మీదే నిలపాలి!" — రామకృష్ణ పరమహంస

సమ్యజ్ నిర్ణయం, సమ్యగ్ వాక్కు, సమ్యగ్ వర్తన, సమ్యగ్ జీవనం, సమ్యక్ ప్రయత్నం, సమ్యజ్ మనస్సు, సమ్యక్ సమాధి



అనే 8 అంశాలతో కూడిన ధర్మ మార్గాన్ని బుద్ధుడు బోధించాడు. ఆ 8 అంశాలకూ ప్రతీకలు 8 ఆకులూ: చక్రం మధ్య కుండ మీద 3 చుక్కలు ఉంటాయి. దుఃఖహేతువులైన దుష్ట చింతన, అజ్ఞానం, కామం-అనే మూడింటికీ ఆ చుక్కలు సంకేతాలు. మొత్తం మీద పరిణామ శీలమైన ఈ జగత్తునూ, దాని క్షణికత్వాన్నీ ఈ చక్రం సూచిస్తుంది.



జైనమతం ముఖ్యంగా చెప్పేది: "జీవులన్నీ నిత్యములు. కర్మవల్ల వాటికి బంధనం ఏర్పడుతుంది. సద్ విశ్వాసం, సద్ జ్ఞానం,



సత్ ప్రవర్తన - అనే త్రిరత్నాల సాయంతో ఆ బంధనాల నుంచి విముక్తి సాధించవచ్చును."

ఇటీవల మన దేశం పెద్ద ఎత్తున జరుపుకున్న మహావీరుని (జైనమత స్థాపకుడు) 2,500 వ వర్ధంతి ఉత్సవాల సందర్భంలో నెలవంక, స్వస్తికం, మధ్య ఒక చక్రంతో

## 365 కిటికీలు గల ప్రాచీన దుర్గం

పోలండ్ దేశంలో టూరిస్టులకు ఒక ప్రత్యేక ఆకర్షణ: 'ఉజాజ్'లోని ప్రాచీన దుర్గం (castle). 17 వ శతాబ్దిలో నిర్మించబడ్డ ఈ దుర్గంలో సంవత్సరాన్ని సూచిస్తూ 4 ఋతువులకూ సంకేతంగా 4 బురుజులూ, 12 నెలలకూ సూచకంగా 12 పెద్ద హాలులూ, 52 వారాలను సూచిస్తూ 52 గదులూ, 365 రోజులకూ సంకేతంగా 365 కిటికీలూ అమర్చారు.

"ప్రగాఢమైన 'నిరాశ' నుంచే 'ఆశ' అంకురిస్తుంది."

కూడిన అర చెయ్యి జైన మత ప్రతీకగా వాడుక చేశారు.



త్రి రత్నాల ద్వారా మానవ జాతికి విమోచనం సాధ్యం అనే ఆశను అర చెయ్యి సూచిస్తుంది. స్వస్తికం మంగళ చిహ్నం. జైన ధర్మాన్ని అనుష్ఠించే వారికి శుభం చేకూరుతుందని దాని అర్థం. స్వస్తికం పైన ఉన్న



మూడు చుక్కలూ అధోలోకం, మధ్య లోకం, ఊర్ధ్వ లోకం - అనే మూడు లోకాలనూ సూచిస్తాయి. చంద్ర వంక ముక్తులైన వారు నివసించే పరలోకానికి ప్రతీక.

ఆటోమన్ తుర్కులు బిజాంటైన్ సామ్రాజ్యాన్ని జయించి నప్పుడు ఆ సామ్రాజ్యం



తాలూకు సైనిక లాంఛనం అయిన 'నెలవంక, నక్షత్రం' గుర్తును వారు గ్రహిం

## 8 వ శతాబ్ది నాటి కొరియన్ యాత్రా గ్రంథం

అంతగా ప్రసిద్ధుడు కాని మైయిూస్ అనే ఒక కొరియన్ బౌద్ధ సన్యాసి వ్రాసి పెట్టుకున్న యాత్రా గ్రంథం ఒకటి ఇటీవల వెలుగులోకి వచ్చింది. 8 వ శతాబ్ది నాటి భారత దేశ పరిస్థితులను తెలిపే ఏకైక లిఖితాధారం ఇదే అంటున్నారు. ఆ యాత్రా గ్రంథం కథనం ప్రకారం ఆ నాడు వింధ్య పర్వతాలకు రెండు వైపులా మొత్తం 5 రాజ్యాలు వ్యాపించి ఉండేవి. అన్ని రాజ్యాలలోనూ ప్రజలు ఒకే భాష మాట్లాడే వారు. ఒకే రకం దుస్తులు వేసుకునేవారు. ఆచార వ్యవహారాలూ, న్యాయస్థానాల పద్ధతీ-అంతా ఒకే విధంగా ఉండేది.

"దేనివల్ల సౌఖ్యం లభిస్తుందో చెప్పడం కష్టం;
కలిమీ, లేమీ - రెండూ ఆ విషయంలో విఫలం అయాయి!" - ఫ్రాంక్ మెకిన్నీ హబ్బర్డ్

చారు. నిజానికి ఈ ప్రతీకకు మత సంబంధమైన ప్రాముఖ్యం ఏమీ లేకపోయినా ప్రస్తుతం ఇస్లామిక్ సంస్కృతికి అదే ప్రధాన ప్రతీక అయింది.



లోక యాత్రలో అలసిన పాంథులకు ప్రశాంతమైన చల్లని వెలుగు నిచ్చే వాడు చంద్రు డనీ, వాళ్ళ దేవాధిదేవుడు అల్లాను చేరే మార్గాన్ని నక్షత్రం నిర్దేశిస్తుం దనీ ఆధునిక ముస్లిం విద్వాంసులు కొందరు ఈ ప్రతీకను వ్యాఖ్యానిస్తున్నారు.

జోరాష్ట్రియన్ మతస్థులకు (ఈ మతస్థులను పార్శీలు అని కూడా అంటారు) అగ్ని ప్రధాన ప్రతీక. జోరాష్ట్రియన్ మతాన్ని స్థాపించిన ప్రవక్త జోరాష్టర్ లేక జరతుష్ట్రి (క్రీ. పూ. 628-551). మంచి ఆలోచన, మంచి మాట, మంచి చేత - ఇదే ఈ మతం బోధించే ప్రధాన సిద్ధాంతం. అగ్ని సర్వ కళ్మలాలనూ దహించి వేసేది గనుక అది అపరిశుద్ధం కావడం అంటూ ఎప్పుడూ జరుగదు. జోరాష్ట్రియన్‌లకు అగ్నే భగవంతుడు. అదే సర్వ జీవులలోనూ ప్రకాశించే వెలుగు!

జోరాష్ట్రియన్ మతంలో కనిపించే ఒక ముఖ్యాంశం - వాళ్ళ ఆలయాలలో పవిత్రమైన 'అగ్ని'ని ఎన్నడూ చల్లారిపోకుండా చూడడం. ఆలయ పూజారులు నిర్ణీతమైన



వేళలలో రోజూ అయిదు సార్లు ఆ అగ్నికి ఇంధనాలు చేరుస్తూ ఉంటారు. బూడిదను ఎప్పటి కప్పుడు తొలగిస్తారు. పవిత్రమైన ఆ భస్మాన్ని బొట్టుగా భక్తులు నుదుట ధరిస్తారు.

ఏసు క్రీస్తు సిలువ మీద తన ప్రాణాలు అర్పించిన నాటి నుంచీ క్రైస్తవులకు 'సిలువ' పవిత్రమైన ప్రతీక అయింది.

ప్రతి మతానికీ ఒక పవిత్రమైన ప్రతీక ఉండడం మాత్రమే కాదు; ఆ ప్రతీకల ద్వారా అన్ని మతాలూ ఒకే సత్యాన్ని బోధిస్తున్నాయి. మనిషి కంటె అతీతుడైన పరమాత్మ ఒక డున్నాడు. ఆ పరమాత్మను సూచించడమో లేదా ఆయనను చేరుకోడానికి అనుసరించ వలసిన ఉత్తమ మార్గాన్ని సూచించడమో చేస్తాయి అన్ని మతాల ప్రతీకలూ!

"మంచి ఆలోచనలు విస్మృతి పాలైనా నశించవు!" —పుబ్లీలియస్ సెరస్

# అవీ-ఇవీ

## దోసె, ఇడ్లీల ప్రారంభం:

బరోడా యూనివర్సిటీలో పరిశోధక విద్యార్థిని కుమారి శారదా శ్రీనివాసన్ అభిప్రాయం ప్రకారం 12వ శతాబ్దంలో ద. భారతదేశంలో రాజ్యమేలిన చాళుక్య రాజు సోమేశ్వర భూలోక మల్లుని కాలంలోనే దోసె, ఇడ్లీ మొట్టమొదట అవతరించాయి. ఆ రాజు రచించిన 'మానసోల్లాసం' లో శాకాహార, మాంసాహార వంటకాల వర్ణనకు ఒక పూర్తి అధ్యాయాన్నే కేటాయించాడు.

* * *

## విద్యారంగంలో కంప్యూటర్‌లు:

'మాక్మిలన్ ఇండియా' అనే సుప్రసిద్ధమైన ప్రచురణ సంస్థ త్వరలోనే ఇండియాలో విద్యారంగంలో వాడదగిన కంప్యూటర్‌లను ఉత్పత్తి చేయబోతూంది. విద్యావిషయికమైన పుస్తకాలను-ఏటా 60 లక్షల ప్రతులు-అమ్మే ఆ సంస్థ ప్రస్తుతం అభివృద్ధి చెందిన దేశాలలో విద్యారంగంలో వాడుకలో ఉన్న మూడో తరం కంప్యూటర్‌లను ఇండియాలో కూడా తయారు చెయ్యడానికి పూనుకుంది.

* * *

## 'సిట్రనెల్లా' గడ్డినుంచి నూనె:

అస్సాంలోని 'పెంగారి' అనే గ్రామంలోని ప్రజలు పొడుగ్గా ఎదిగే సిట్రనెల్లా అనే ఒకరకం పరిమళపు గడ్డిని తమ దొడ్లలోనే కాక, వేలాది ఎకరాల భూమిలో కూడా పెంచుతున్నారు. ఆ గడ్డిని బట్టీ పట్టి రాబట్టే నూనె పరిమళంగా ఉంటుంది. పరిమళపు కెమికల్స్, పరిమళపు సబ్బులు, షేవింగ్ క్రీమ్, అగరువత్తులు మొదలైన వాటి తయారీలో ఈ నూనె ప్రధానంగా వాడుక చేయబడుతూంది.

## 7,000 ఏళ్ల నాటి మట్టి ఎలుగుబంటు



హంగరీ లోని 'స్జోల్‌నాక్' లో 7,000 ఏళ్ళనాటి మట్టితో చేసిన ఒక ఎలుగుబంటును భూమిలోనుంచి త్రవ్వి పైకితీశారు. దానితో పాటు ఎన్నో ప్రాచీనకాలపు కుండపెంకులూ, ఆభరణాలూ, లోహ పరికరాలూ బయటపడ్డాయి. అవి శిలాయుగానికీ, హంగరీలోని 'అర్పద్' రాజుల కాలానికీ మధ్యలో వేర్వేరు కాలాలకు చెందినవి.

# నీ అంతరాత్మే నీకు ప్రమాణం

కె. వి. పుట్టప్ప

వేదాలు ఏం చెప్పా యని చూడకు!
మనిషి అంతరాత్మను మించిన
 'వేదం' లేదు
'మనువు' ఏమి విధించాడు అని కాదు—
నీ హృదయమే నీ ఋషి!
నీకు నువ్వే ఒక 'మనువు' వి!

దప్పికగొన్న సోదరుడు ఇంటికి వస్తే
దాహం ఇచ్చి దప్పిక తీర్చు మని
 'మనువు' మనకు చెప్పాలా?
సాటివాని కన్నీరు తుడిచి
 ఓదార్చవలసి ఉంటే
అలా చెయ్యమని వేదంలో ఉండాలా?

అంటరాని వాడి బిడ్డ మన కళ్ళ ఎదుట
 చెర్లో మునిగిపోతూంటే
అంటితే నా బ్రాహ్మణత్వం
 మంట గలుస్తుం దని
ఒడ్డున చేతులు ముడుచుకు
 కూర్చుంటానా?

కల్ల - 'మనువు' ఒక్కనాటికి
 అలా చెప్పి ఉండడు!
అలాగే గనుక చెప్పి ఉంటే
 'మనుస్మృతి'ని చుట్టచుట్టి
వీథిలోకి గిరాటు వేస్తాను.
ఆయన చెప్పే స్వర్గానికి
 నేను దూరం అయితే కానీ!
నరకం నాకు చేరువ అయితే కానీ!

స్వర్గం ఎన్నటికీ నాకు దూరం కాదు
నరకం ఎన్నటికీ నాకు చేరువ కాదు
'స్వర్గం', 'నరకం' వేదాల్లో లేవు!

అంతఃకరణ ప్రబోధమే
అతి పవిత్రమైన ఆదేశం
అదే అనుసరించదగ్గ సంహిత—
అలనాటి ఋషి చెప్పింది కాదు!
ఆనాటి ఆ ఋషులు కూడా
మనందరిలాంటి మనుష్యులే!
ఆ యా కాలాలకు పనికొచ్చే ధర్మాలను
ఆ నాడు వారు చెప్పారు!
దేశ కాలాల కనుగుణంగా
ఎవరి హృదయమే వారికి వేదం కావాలి!

(కన్నడ మూలానికి ఎస్. నసీగ్ చేసిన
ఇంగ్లీషుకి తెలుగు సేత: 'శ్రీమాన్')
—'ఇలస్ట్రేటెడ్ వీక్లీ' సౌజన్యంతో.

## భర్తల కంటె ఎక్కువ సంపాదించే అమెరికన్ మహిళలు

1981 లో 60 లక్షల మంది అమెరికన్ మహిళలు-అంటే ప్రతి 8 మంది మహిళలలో ఒకరు-తమ భర్తల కంటె ఎక్కువ ఆదాయం గడించారు.

"ప్రసంగాలకోసం చదివే వారూ, వ్రాసేందుకు చదివేవారూ కోకొల్లలు;
ఆలోచించేందుకు చదివేవారు అరుదు!" —సి.సి. కోల్టన్

## ఎందుకు ?

# సూర్యునికి ఉదయాస్త మయాలు ఎందుకు సంభవిస్తాయి?



నిరంతరం తన చుట్టూ తాను గుండ్రంగా తిరుగుతున్న భూగోళం మీద మనం జీవిస్తూ ఉండడం వల్ల మనకు సూర్యుడు ఉదయించడం, అస్తమించడం జరుగుతూంది. తిరుగుతున్న భూమి పగటి పూట మనల్ని సూర్యుడి కెదురుగానూ, రాత్రిపూట సూర్యుడికి దూరంగానూ తీసికొని పోతూంది. పగటి పూట సూర్యుడికి ఎదురుగా ఉన్న అర్ధగోళం లోనూ, రాత్రిపూట సూర్యునినుండి మరుగు పడిన అర్ధ గోళంలోనూ మనం ఉంటామన్న మాట!

సూర్యుడు మన దిక్చక్రం మీద కనిపించగానే మన అర్ధగోళం సూర్యుడి కభిముఖంగా రావడం ఆరంభం అవుతుంది. దిక్చక్రం మీద సూర్యుడు మన కంట బడడానికి 8 ని. ల ముందే నిజానికి సూర్యుడు ఉదయించి ఉంటాడు. సూర్యుని కాంతి మన కళ్ళను చేరుకోడానికి 8 ని. ల కాలం పడుతుంది. అలాగే సాయంత్రం సూర్యుడు మనకు కనుమరుగవడానికి 8 ని. ల ముందే నిజంగా సూర్యాస్తమయం జరుగుతుంది.

తిరుగుతూన్న భూగోళం సూర్యుడు మరుగైన భాగం నుంచి సూర్యకాంతి పడే వైపుకి మనల్ని తీసుకొని వస్తున్న తొలి క్షణమే సూర్యోదయం అవుతుంది అలాగే సూర్యుని వెలుతురు పడే భాగం నుంచి సూర్యుడు మరుగయ్యే భాగం వైపుకి మనల్ని కొనిపోయే తొలి క్షణాన సూర్యాస్తమయం అవుతుంది. రోజూ 24 గంటలలోనూ ఏ నిముషంలో చూసినా భూగోళం మీద ఎక్కడో ఒకచోట మిట్ట మధ్యాహ్నం, మరోచోట అర్ధరాత్రి, ఒకచోట ఉదయ సమయం, మరోచోట సాయం సమయం అయి ఉంటాయి!

## ప్రపంచంలో ఎక్కువ మంది మాట్లాడే ప్రధాన భాషలు

ప్రస్తుతం ప్రపంచ జనాభాలో మూడింట రెండు వంతులు ఈ క్రింది 11 ప్రధాన భాషలు మాట్లాడుతున్నారు: చైనీస్ (మాండరిన్), హిందీ, ఇంగ్లీష్, స్పానిష్, రష్యన్, అరబిక్, బెంగాలీ, పోర్చుగీస్, జర్మన్, ఫ్రెంచ్, జపనీస్.

"చెడు కోరికలను కాక మంచి కోరికలను మనం దాచుకోవలసి రావడం నిజంగా విచిత్రం!" —డబ్ల్యు.ఎస్. లాండర్

# 'మృత్యువు' అంటే ఏమిటి?

## శ్రీ జె. కృష్ణమూర్తి

'మృత్యువు' అంటే ఏమిటో తెలుసుకోవాలంటే ఆ మృత్యువు వచ్చేదాకా జీవించి ఉండడం అంటే ఏమిటో కూడా ఆలోచించాలి. ఈ దారుణమైన యాతనలు, ఈ భయం, ఈ



ఆందోళన, ఈ దుఃఖం-ఇదేనా 'జీవించడం' అంటే? అలాంటి ఈ జీవితాన్ని వదలిపోవలసి వస్తుందనేనా 'మృత్యువు' అంటే మనిషి భయపడుతూంది? 'జీవించడం' అంటే ఏమిటో తెలిస్తే గాని 'మృత్యువు' అంటే ఏమిటో తెలియదు. ఆ రెండింటికీ విడదీయరాని లంకె ఉంది. 'జీవితం' సమగ్ర స్వరూపాన్ని దర్శించ గలిగిన రోజున 'మృత్యువు' సమగ్ర స్వరూపాన్ని కూడా మనం దర్శించగలము. దురంతమైన యాతనగా, తీవ్రమైన సంఘర్షణగా - మనిషికీ, మనిషికీ మధ్య, స్త్రీలకూ పురుషులకూ మధ్య, ఇరుగు పొరుగుల మధ్య ఎడతెరపి లేని సంఘర్షణగా - మన జీవితాలు తయారయాయి

ముక్కలు చెక్కలు కాని అఖండమైన, సమగ్రమైన జీవితం గడపడం మనిషికి సాధ్యం కాదా? మృత్యువును చూసి హడలిపోవడానికీ, విభ్రాంత పడడానికీ, రెండు చేతులతో దానిని ఆహ్వానించలేకపోవడానికీ కారణం సమగ్రమైన జీవితం మనిషి జీవించక పోవడమే!

మృత్యువు అంటే తనకు తెలిసి ఉన్న సమస్తమూ, తన అనుబంధాలూ అంతరించిపోవడం. జీవించి ఉండగానే అలాంటి స్థితిని మన మనస్సు సాధించ లేదా? అలా సాధించ గలిగితే 'మృత్యువు' తాలూకు పూర్తి అర్థం మనకు బోధపడుతుంది. జీవితంలో 'నేను'ను అంటిపెట్టుకొని ఉన్నంతకాలం 'మృత్యువు'ను

(మిగతా 18 వ పేజీలో)

---

## ప్రపంచంలో ఎక్కువ సమ్మర్దం గల రైల్వే

'జపనీస్ నేషనల్ రైల్వేస్' ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ రద్దీ గల రైలు సంస్థ. 1982 లో 1.86.10,000 మంది ప్రయాణికులు ఆ రైలు మార్గంలో ప్రయాణించారు.

---

"అసంఖ్యాక జీవిత చరిత్రల సారాంశం 'చరిత్ర'!" —థామస్ కార్లైల్

## ఎలా ?

# బొగ్గు ఎలా ఏర్పడింది?

భూగోళం మీద మనిషి అవతరించడానికి చాలా కాలం క్రితం, బహుశః జంతుజాలం కూడా ఇంకా అవతరించి ఉండని సుమార



ప్రాచీన కాలంలో ఇక్కడ బ్రహ్మాండమైన అడవులు మాత్రమే ఉండేవి. ఆ అడవుల లోని చెట్లు నేటి ముళ్ళపొదలు, 'మేర్స్ టెయిల్స్' మొక్కల వంటివి. అయితే వాటి సైజు చాలా పెద్దది.

కాలక్రమేణ ఒత్తుగా పెరిగిన ఆ అడవులు వరదలు వచ్చి మునిగిపోయి నేలలోకి క్రుంగి, వాటి మీద ఇసుక పొర ఏర్పడేది. అలా భూగర్భంలో చేరిన చెట్లు కుళ్ళి శిథిలమై శిలాస్థులు (fossils గా మారడంవల్ల బొగు ఏర్పడింది. కొన్నాళ్ళకు మళ్ళీ అడవులు పెరగడం, మళ్ళీ వరదలు వచ్చి అవి నేలలోకి క్రుంగిపోవడం జరిగేది. ఇలా ఎన్నోసార్లు జరిగింది. అందుకే బొగ్గు గనులలో పొరలు పొరలుగా బొగ్గు మనకు కనిపిస్తుంది. రొట్టె చీలికల మధ్య మాంసం పరచి తయారుచేసే శాండ్విచెస్‌లాగ బొగ్గు గనులలో ఒక పొర బొగ్గు దాని మీద ఇసుక, బురదల పొర, మళ్ళీ బొగ్గు పొర- ఇలా ఎన్నో పొరలు కనిపిస్తాయి. పైన చేరిన మట్టి ఒత్తిడివల్లా, కొన్ని రాసాయనికమైన మార్పులవల్లా ఆ వృక్ష పదార్థమే క్రమంగా బొగ్గుగా మారింది.

భూగర్భంలో బొగ్గు ఏర్పడడం మొదలు పెట్టిన తరువాత లక్షల సంవత్సరాలు గడిచి పోయాయి. ఒక మీటర్ మందం గల బొగ్గు ఏర్పడడానికి సుమారు 1,000 సం. ల కాలం పట్టి ఉండవచ్చును. ఇంగ్లండ్‌లోని కొన్ని బొగ్గు గనులు భూగర్భంలో అడుగున రెండు మైళ్ళలోతు వరకూ విస్తరించి ఉన్నాయి ●

---

(17 వ పేజీ తరువాయి)

మనిషి అర్థం చేసుకోలేడు. మృత్యువును చేరుకునేటప్పుడు భౌతిక శరీరాన్ని, దాని అలవాట్లనూ, ఆ శరీరమే తను అనే భావాన్ని, ఆ శరీరం పేరునీ, ఆ పేరు చెప్పగానే ముపిరే జ్ఞాపకాలనూ - వేటినీ మనిషి తను వెంట తీసుకు వెళ్ళలేడు. ఆర్జించిన డబ్బును తన వెంట తీసుకుని పోలేడు. అదే విధంగా జీవించి ఉండగానే వాటి కన్నిటికీ మనం స్వస్తి చెప్పలేమా? ●

"ఇతరులను తెలుసుకున్నవాడు జ్ఞాని,
తనను తను తెలుసుకున్నవాడు వివేకి!" -లావో-త్సే

# 'అద్దం' కథ

పాలిష్ చేయబడిన ఉపరితలం కలిగి ఒక క్రమ పద్ధతిలో కాంతిని ప్రతిఫలించే వస్తువును 'అద్దం' అంటారు. ప్రపంచం



అంతటా ప్రతి యుగంలోనూ మనుష్యులు తమ ప్రతిబింబాలు తాము చూసుకోడానికి వీలుగా చక్కగా ప్రతిఫలించగల అద్దాలను తయారు చేసుకునే ప్రక్రియల కోసం ప్రయోగాలు చేస్తూనే వచ్చారు.

ఈజిప్షియన్‌లు, ఇట్రస్కన్‌లు, గ్రీక్‌లు, రోమన్‌లు మొదలైనవారు వాడిన మిక్కిలి ప్రాచీన కాలపు అద్దాలు సాధారణంగా బాగా పోలిష్ చేసిన పల్చని గుండ్రని లోహపు (తరచు కంచుతో చేసిన) ఫలకాలరూపంలో ఉండేవి.

మధ్య యుగంలో ఈ చేతి అద్దాల స్థానే నగిషీ పెట్టెలలో అమర్చి వెంట తీసికొని పోదగిన అద్దాలు వాడుకలోకి వచ్చాయి. దంతంతో గాని, విలువైన లోహాలతో గాని ఆ పెట్టెలు తయారు అయేవి. స్త్రీలను ఇవి ఎక్కువగా ఆకర్షించేవి. వారి వడ్డాణాల నుంచి వేలాడుతూ తరచు అవి కనిపించేవి. 12 వ శతాబ్ది చివరో, 13 వ శతాబ్ది ఆరంభంలోనో గాజు పలకకు వెనుక లోహపు పూత పూసి అద్దాలు తయారు చేయడం యూరోపియన్‌లు కనిపెట్టారు.

సీనారేకు, పాదరసాల మిశ్రమాన్ని గాజు పలక వెనుక పూసి అద్దాలు తయారు చెయ్యడంలో జర్మనీలోని నూరెంబర్గ్, ఇటలీలోని వెనిస్ నగరం మిక్కిలి వాసి కెక్కాయి. అది 16 వ శతాబ్ది నాటి పరిస్థితి. ఆ తరువాత

## స్థూలకాయులకు కేన్సర్ ప్రమాదం

కెనడాలోని పశ్చిమ ఒంటేరియో యూనివర్శిటీకి చెందిన డా॥ కెన్నత్ కెరోల్ అభిప్రాయం ప్రకారం స్థూలకాయులకు కేన్సర్ వచ్చే అవకాశం ఎక్కువ. కేన్సర్ వ్యాధి రావడం, క్రమంగా ఆ వ్యాధి పెరుగడం ఆహారంలో మనం తీసుకునే కొవ్వు పదార్థాల మీదా, మానవ దేహంలో పెరిగే కొవ్వు పదార్థాల మీదా ఎక్కువగా ఆధారపడి ఉంటుంది.

"'రాజు తప్పు చేయడం అసంభవం!' అనేదే ఇంగ్లీష్ రాజ్యాంగానికి ప్రాతిపదిక సూత్రం!" -సర్ డబ్ల్యు. బ్లాక్‌స్టోన్

100 ఏళ్ళకు కూడా 'అద్దం' వెల చాలా అధికంగానే ఉండేది. జన సామాన్యానికి అది అందుబాటులో ఉండేది కాదు.

అద్దాల ఉత్పత్తిలో 1835 లో పెద్ద మార్పు వచ్చింది. ఆ ఏడాది జర్మన్ కెమిస్ట్ అయిన జస్టస్ వాన్ లీబిగ్ 'సిల్వరింగ్' అనే పూత పూసే ప్రక్రియ కనిపెట్టాడు. నేటికీ అదే వాడుకలో ఉంది. ఈ ప్రక్రియలో సిల్వర్ నైట్రేట్‌లోని వెండిని గాజు పలకమీద పట్టించి, దానికి రక్షణగా లక్కలాంటి పదార్థాన్ని పెయింట్ చేస్తారు.

నూరెంబెర్గ్‌లో అద్దాలు తయారు చేసే వారిని గూర్చిన మొట్టమొదటి ప్రస్తావన 1373 నాటిది కనిపిస్తుంది. వెనిస్ నగరంలోని ఉత్పాదకుల లాగ కాకుండా జర్మన్‌లు సీనారేకుతో పాదరసానికి బదులుగా సీసం (lead) కలిపిన మిశ్రణాన్ని గాజుపలక వెనుక పూసేవారు. గాజు పలకలను అద్దాలుగా తయారు చేసే ఈ పరిశ్రమను 'నూరెంబర్గ్' దాని సమీపంలోని 'ఫుర్త్' నగరాలలో ప్రభుత్వమే కొనసాగించేది. కాలక్రమేణ 18 వ శతాబ్దంలో ఈ పరిశ్రమకు 'ఫుర్త్' నగరమే ప్రధాన కేంద్రం అయింది.

'ఫుర్త్'లోని అద్దాల ఉత్పాదకులు ప్రథమ ప్రపంచ సంగ్రామాన్నీ, ఆ తరువాత 1930 లలో వచ్చిన ఆర్థిక మాంద్యాన్నీ (depression) తట్టుకొని నిలబడ గలిగారు. ఇటీవలనే ఆ నగరంలో నాలుగు ప్రధాన ఉత్పాదక సంస్థలు ఏకమై 'ఫ్లాబెగ్' (flabeg) అనే సంస్థగా ఏర్పడ్డాయి. ప్రపంచంలో ప్రస్తుతం అద్దాలు తయారుచేసే సంస్థలలో ఇదే మిక్కిలి పెద్దది. తన ఉత్పత్తి మొత్తంలో మూడవ వంతు పైచిలుకు ప్రపంచంలోని నూరు విభిన్న దేశాలకు ఈ సంస్థ ఎగుమతి చేస్తుంది. ●

---

## రంజీ ట్రోఫీలో మన్కడ్ స్థాపించిన రికార్డు



బొంబాయి జట్టు కెప్టెన్ 36 ఏళ్ళ అశోక్ వినూ మన్కడ్ 1982 లో రంజీ ట్రోఫీ క్రికెట్ పోటీలలో మొత్తం 6,317 పరుగులు సాధించి, అంతకు ముందు విజయ్ హజారే నెలకొల్పిన 6,312 పరుగుల రికార్డును అధిగమించాడు. గుజరాత్ జట్టుతో బొంబాయిలో జరిగిన పోటీలో ఔటు కాకుండా 100 పరుగులు చేసి (అది ఆ పోటీలలో అతని 21 వ సెంచరీ) అతడు ఈ ఘనకార్యం సాధించాడు.

"'దయ' ఎప్పుడూ వృథాకాదు; అవతలి వానిమీద దాని ప్రభావం లేకపోయినా ప్రదర్శించే వానికి అది మేలు చేస్తుంది." —ఎస్. హెచ్. సిమ్మన్స్

# 'హనీగైడ్' పిట్ట వింత అలవాట్లు

డా. సుధీర్ సేన్ గుప్త

ప్రపంచంలో వేర్వేరు జాతుల పిట్టలు తమ ఆకాశ విహారాని కనుగుణంగా తమ దేహం



లోని యంత్రానికి ఇంధనం సమకూర్చడం కోసం వేర్వేరు రకాల ఆహార పదార్థాలను ఎంచుకుంటూ ఉంటాయి. ద. ఆఫ్రికాలోని ఉష్ణమండల ప్రాంతంలో ఎక్కువగా కనిపించే 'హనీగైడ్' పిట్ట తిండి అలవాట్లు చాలా విచిత్ర మైనవి. తేనె పట్టులోని మైనం దాని ప్రధానమైన ఆహారం. ఆ మైనాన్ని సంపాదించటానికి కొన్ని తెగల 'హనీగైడ్' పిట్టలు ఒక స్తనంధయ జాతి (mammal) జంతువుతోనో, లేదా ఒక మనిషితోనో చిత్రంగా జత కడతాయి.

చాలా రోజుల క్రితం 1569 లో ఒక పోర్చుగీస్ మిషనరీ పిచ్చుక సైజులో ఉన్న ఒక పిట్ట వచ్చి చర్చిలో తాను వెలిగించిన కొవ్వొత్తులను అరగిస్తూ ఉండడం చూసి ఆశ్చర్య పోయాడు. ఇటీవలి కాలంలో ఈ రకం 'హనీగైడ్' పిట్ట అలవాట్లను గురించీ, దాని భాషను గురించీ విశేషంగా పరిశోధనలు జరిగాయి.

హనీగైడ్ పిట్టలలో 11 తెగలు (species) ఉన్నాయి. ఆఫ్రికా, బర్మా, మలేషియా, సుమత్రా (ఇండోనేషియా)లలోనూ, మన దేశంలోని హిమాలయాలలోనూ ఈ పిట్టలు కనిపిస్తాయి. 10.8 సెం.మీ.లు మొదలు 12 సెం.మీ.ల పొడవు దాకా అవి ఎదుగుతాయి. ఈ పిట్ట దేహం మీదిభాగం పెంకు

## రోజు రోజుకి పెరుగుతున్న భూ భారం

రష్యన్ శాస్త్రవేత్తల లెక్కల ననుసరించి భూమి బరువు రోజుకు 100 మొదలు 110 టన్నుల చొప్పున పెరుగుతూ వస్తూంది. దీనికి కారణం దూరాకాశం నుంచి రోజూ ఎన్నో ఉల్కలు వచ్చి భూమిమీద పడుతూ ఉండడం; ధూళి కణాలు నిత్యం భూగోళం మీద రాలుతూ ఉండడం!

"స్వల్పకాలిక పరాజయాలు తట్టుకోడానికి
దీర్ఘకాలిక లక్ష్యాలు ఏర్పరచుకోవాలి!" —ఛార్లెస్ సి. నోబిల్

రంగుగానూ, దిగువ భాగం లేత బూడిద రంగుగానూ ఉంటుంది. సాధారణంగా అవి అడవులలో ఉంటాయి. కందిరీగ, తేనెటీగ వాటి గుడ్లు, మైనం ఈ జాతి పిట్టలకు ప్రధాన మైన ఆహారం.



ఆఫ్రికాలోని ఉష్ణమండలపు అడవులలోని హానీగైడ్‌లు ఒక 'బాడ్జర్' (నేల కలుగులలో జీవించే నక్కంత సైజులో ఉండే ఒక జంతువు)నో, ఆటవిక జాతికి చెందిన ఒక మనిషినో నేర్పుగా అడవిలో తేనెపట్టు ఉన్న చోటికి ఆకర్షించి, తన వెంట తీసుకొని పోయే చిత్రమైన అలవాటు చేసుకున్నాయి. అడవిలో ఎక్కడైనా దానికి తేనెపట్టు కనిపించగానే అది ఒక 'బాడ్జర్' దగ్గరకో, ఒక ఆటవికుని వద్దకో వచ్చి రకరకాలుగా అరుస్తూ చిత్ర విచిత్ర విన్యాసాలతో వారిదృష్టి నాకర్షిస్తుంది. తరువాత తేనెపట్టు ఉన్న దిశగా కొద్ది దూరం వెళుతుంది. వాళ్ళు తన వెంట వస్తున్నారా లేదా అని చూస్తుంది. రాకపోతే మళ్ళీ వెనక్కు వెళ్ళి వెనుకటిలాగే అరుస్తుంది. వాళ్ళు తన వెంట బయలుదేరితే తడవకు కొన్ని అడుగుల దూరం ముందుకు వెళుతూ, వాళ్ళు తనను చేరుకోగానే మరి కొన్ని అడుగులు ముందుకు ఎగురుతూ - ఇలా క్రమంగా వారిని తేనెపట్టు ఉన్న చోటికి చేరుస్తుంది. ఈ విధంగా 750 గజాల దూరంలో ఉన్న తేనెపట్టు వద్దకు 25 నిముషాలలో వారిని అది తీసికొని పోగలదు. తేనెపట్టు పక్క కొమ్మ మీద వాలి అది తేనె పట్టును వారి దృష్టికి తెస్తుంది. వెంటనే ఆ 'బాడ్జర్' లేదా ఆటవికుడు ఆ తేనెపట్టును కొట్టడం, తేనెను అస్వాదించడం జరుగుతుంది. వాళ్ళు తేనెను ఆస్వాదిస్తున్నంత సేపూ అతి ఓర్పుగా హానీగైడ్ కొమ్మ మీద నిరీక్షిస్తూ ఉంటుంది. తేనె అంతా తాగి వారు మైనపు ముక్కలు కింద వదలి వెళ్ళిపోగానే 'హనీగైడ్' చెట్టు దిగి వస్తుంది. అవు రావురు మంటూ ఆ మైనాన్ని అరగిస్తుంది. తేనెటీగల గుడ్లను చిదుముకుని తినడం అంటే కూడా 'హనీగైడ్'కి చాలా ఇష్టం. కేవలం తేనెపట్టు మైనం ఒక్కటే ఆహారంగా తీసు

---

## 69 మంది పిల్లల్ని కన్న మహాతల్లి

రష్యాలో జార్ రాజుల పాలనలో శ్రీమతి ఫయొదోర్ వాసిలెట్ తన 27 కాన్పులలోనూ మొత్తం 69 మంది పిల్లల్ని కన్నదట! నలుగు రేసి పిల్లల చొప్పున 4 సార్లూ, ముగ్గురేసి చొప్పున 7 సార్లూ, ఇద్దరేసి చొప్పున 16 సార్లూ పిల్లలను ఆమె ప్రసవించింది.

---

"తృప్తికి మార్గం - ఇంధనాలు చేర్చడం కాదు, మంట తగ్గించడం; ఇంకా, ఇంకా డబ్బు గడించడం కాదు; కోర్కెలు తగ్గించుకోడం!" —థామస్ ఫ్యుల్లర్

కుంటూ ఎక్కువ కాలం ఈ పిట్ట గడపగలదు. వెన్నెముక గల జంతువు లేవీ మైనాన్ని తిని హరించుకోలేవు. అలాంటప్పుడు రాసాయనిక పరిభాషలో 'మిరిసిల్ పాల్మి టేట్' అనబడే ఈ మైనం హనీగైడ్ పిట్ట ఆహారనాళంలో పుష్టికరమైన ఆహారంగా మారడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అయితే ఇటీవలి పరిశోధనల వల్ల ఈ పిట్ట పేగులలోని 'యీస్ట్', 'మైక్రోఫ్లోరా సెరాటిక్ మైకోకోకస్' అనే రాసాయనికం మైనాన్ని ఛిన్నాభిన్నం చేసి ఉపయోగకరమైన ఆహారంగా మారుస్తున్నట్టు స్పష్టమైంది.

హనీగైడ్ పిట్టల శృంగార జీవితం కూడా ఎంతో ఆశ్చర్యం కలిగిస్తుంది. విచక్షణ లేకుండా అన్ని రకాల పక్షులతో కలిసిపోయి, అన్యోపజీవులు (parasites) గా బ్రదికే 'హనీగైడ్' లు పట్టి సోమరిపోతులు. అందుచేత చాలా ఇతర పిట్టలలాగ ఒక మగపిట్ట, ఆడపిట్ట జతకట్టడం గాని, జంటగా అవి కలిసి జీవించడం గాని వీటిలో జరుగదు. ఋతుకాలం రాగానే మగపిట్ట అనుకూలమైన ఒక 'గాన వేదిక' (song spot) ను ఎంచుకొని, అక్కడ కూర్చుని రాగాలు తీయడం మొదలు పెడుతుంది. ఆ రాగాలు ఆడపిట్టలకు స్వాగత గీతాలు. ఒక్కొక్కప్పుడు రోజు రోజంతా అది అలా గానం చేయడం జరుగవచ్చు.

దాని అనునయ స్వరం, దాని పిలుపూ విని ఎన్నో ఆడపిట్టలు దాని వైపు ఆకర్షింపబడతాయి. వాటిలో ఒకటి ఎలాంటి హంగామా చేయకుండా దానిని సమీపిస్తుంది. కొంతసేపు వాటి శృంగార కలాపం కొనసాగిన తరువాత తృప్తిచెందిన ఆడపిట్ట తాను గుడ్లు పెట్టడానికి అనుకూలమైన వడ్రంగి

## 500 ఏళ్ల నాటి బాలుని చర్మ విగ్రహం



చిలీలో 500 ఏళ్ళ క్రితం 8 ఏళ్ళ వయస్సు గల ఒక 'ఇంకా' జాతి బాలుణ్ణి సూర్య భగవానుడికి బలి ఇచ్చారు. 'చర్మ విగ్రహం' (mummy) గా తయారు చేసి భద్ర పరచిన అతని శవం ఒక అపురూపమైన పురా వస్తువుగా భావిస్తున్నారు. ఆ శవాన్ని భద్ర పరచడంలో అసాధారణమైన ప్రతిభ కనిపిస్తుంది. సముద్ర మట్టానికి 5,400 అ.ల ఎత్తున చిలీ రాజధాని శాంటియాగోకి 50 కి. మీ. ల దూరంలో ఉన్న సెర్రో ఎల్ ప్లోమో (సీసపు దిబ్బ) మీద శాశ్వతంగా శీతలీకరించబడిన భూగర్భ మందిరంలో దానిని పూడ్చి ఉంచారు.

" 'విశ్వాసం' ఉన్నచోటే 'ప్రేమ'; 'ప్రేమ' ఉన్న చోటే 'శాంతి'; 'శాంతి' ఉన్న చోటే 'దేవుడు'."

పిట్టల గూళ్ళను వెదుకుతూ బయలుదేరుతుంది.

అలాంటి ఒక గూడు తటస్థపడగానే ఆ వడ్రంగి పిట్ట ఏదో పనిమీద గూటినుంచి బయటికి వెళ్ళేదాకా ఓర్పుగా అది వేచి ఉంటుంది. అది బయటికి వెళ్ళగానే ఆ గూటిలో చేరి దొంగచాటుగా అక్కడ ఒక గుడ్డు పెడుతుంది. ఆ విధంగా మూడు నాలుగు వేర్వేరు వడ్రంగి పిట్టల గూళ్ళలో మూడు నాలుగు గుడ్లు అది పెడుతుంది. ఒక్కొక్కప్పుడు వడ్రంగి పిట్ట గుడ్లలో ఒకటి రెండింటిని ఆ గూటి నుంచి అది తొలగించనుకూడా తొలగిస్తుంది. హనీగైడ్ పిట్ట గుడ్డు కూడా వడ్రంగిపిట్ట గుడ్డులాగానే తెల్లగా అదే సైజులో ఉండడంవల్ల వడ్రంగి పిట్ట వాటి మధ్య తేడా తెలుసుకోలేదు. 12 రోజుల పాటు వడ్రంగి పిట్ట ఆ గుడ్లమీద కూచుని వాటిని పొదిగిన తరువాత గూటిలో నుంచి పిల్లల అరుపులు వినిపిస్తాయి.

గుడ్డునుంచి బయటికి వచ్చిన హనీగైడ్ పిల్లలకు ముక్కు పక్కన రెండు పదునైన కొక్కాలు ఉంటాయి. ఆ కొక్కాలతో అది వడ్రంగి పిట్ట పిల్లల్ని పొడిచి చంపుతుంది. చిత్రంగా - దానికి తగిన బలం వచ్చి గూడు వదలి వెళ్ళిపోయే నాటికి దాని ముక్కు పక్కన ఉన్న ఆ రెండు కొక్కాలూ వాటంతట అవే రాలిపోతాయి. ఇంకో చిత్రమైన అంశం ఏమిటంటే పిల్లగా ఉన్నప్పుడు హనీగైడ్‌కి కాలి వేళ్ళకీ మడమకీ మధ్య ఒక గట్టి అట్టలాంటి కండరం, దాని క్రింద ముళ్ళూ ఉంటాయి. 25 రోజులపాటు పెంపుడు తల్లిదండ్రుల పోషణలో బాగా బలం పుంజుకున్న తరువాత, నిర్ఘాంతపడి తెల్లబోయి చూస్తున్న వడ్రంగిపిట్ట కళ్ళ ఎదుటనే హనీగైడ్ పిల్ల గూడు వదలి రివ్వున బయటికి దూసుకు పోతుంది. అయితే - ఏ వయస్సులో ఎలా మైనం తినడం దానికి అలవాటు అవుతుందో ఇంకా స్పష్టంగా నిర్ధారణ కాలేదు. ●

## 13వ శతాబ్ది నాటి బుద్ధ విగ్రహాలు



కొలోన్ (ప. జర్మనీ) లోని తూర్పు ఆసియా కళా ఖండాలను భద్రపరచిన మ్యూజియమ్‌లో మనోహరంగా మలచబడిన రెండు చిన్న బుద్ధ విగ్రహాలను ఇటీవల కనుగొన్నారు. ఇంతవరకూ ఎవరి దృష్టినీ పడకుండా దశాబ్దాల పాటు ఒక స్టోర్ రూమ్‌లో ఉన్న ఈ చిన్న విగ్రహాలను అనుకోకుండా గుర్తించడం జరిగింది. సుప్రసిద్ధ ప్రాచ్య బౌద్ధ శిల్పి కోయెన్ మలచిన ఈ ప్రతిమలు 13వ శతాబ్ది ప్రారంభ కాలం నాటివి.

"ప్రేమించబడడం వల్ల సుఖం, తృప్తి కలుగుతాయి; ప్రేమించడం వల్ల ఆత్మార్పణంలో ఉన్న ఆనందం తెలుస్తుంది." —రెబెకా థామస్ షా

# భూ ప్రదక్షిణం

## హవాయ్ దీవులు

హవాయ్ దీవుల ప్రాచీన చరిత్రను తెలిపే లిఖితాధారాలు ఏవీ లేవు. ఈ దీవులలో తొలుత నివాసం ఏర్పరచుకున్న వారు పోలినేషియన్‌లు అని భావిస్తున్నారు. బహుశః




1,000 సం ల కంటె పూర్వం 'సొసైటీ' దీవుల నుంచి పోలినేషియన్ సాహసిక నావికులు తమ జంట పడవల (double canoes) లో పసిఫిక్ మహాసముద్రం మీద వేల కొద్ది కిలోమీటర్‌ల దూరం ప్రయాణించి ఈ దీవులకు చేరుకుని ఉండవచ్చును. వారు పూర్తిగా అనాగరక స్థితిలో ఉండేవారు.

సుప్రసిద్ధ బ్రిటిష్ నూతన ఖండాన్వేషకుడు కెప్టెన్ జేమ్స్ కుక్ తన మూడవ నౌకాయాత్రలో 1778 లో అనుకోకుండా ఈ దీవులను కనుగొన్నాడు. ఆ యాత్రకు డబ్బు పెట్టుబడి పెట్టిన శాండ్విచ్ ప్రభువు పేరు మీదుగా ఆయన ఈ దీవులకు 'శాండ్విచ్' దీవు లని పేరు పెట్టారు

హవాయ్ దీవి నాయకుడు కామెహాంచా 1795 లో ఈ దీవు లన్నిటినీ జయించి వాటిని తన పాలన క్రిందికి తెచ్చుకున్నాడు ఈ దీవులకు ఆయనే మొదటి రాజు. ఆయన వంశం వారు దాదాపు 100 ఏళ్ళు ఈ దీవులను పాలిం

## జీవన వ్యయం మిక్కిలి ఎక్కువగా ఉన్న నగరం

ఇండియాలోని 8 ప్రధాన నగరాలలోనూ కర్ణాటక రాష్ట్ర రాజధాని బెంగుళూరులో ప్రస్తుతం జీవన వ్యయం చాలా ఎక్కువ. 1983 డిసెంబర్ నెలలో ఆ నగరంలో జీవన వ్యయ సూచి (consumer price index) 625 పాయింట్‌లు అయింది. అన్ని నగరాలలోకీ తక్కువ వ్యయం అయ్యే నగరం కలకత్తా. అక్కడ ధరల ఇండెక్స్ 525 మాత్రమే!

"ఒకే రాతిపల్ల రెండు సార్లు ఎదురుదెబ్బ తినడం కంటె అవమానం వేరే లేదు!" -సిసిరో

చారు. 1820 లో న్యూ ఇంగ్లండ్ నుంచి 'క్లిప్పర్' నౌకలలో తొలి మిషనరీలు ఈ దీవులలో అడుగు పెట్టారు. ఇక్కడ ప్రజలకు మత బోధతోపాటు చదవడం, వ్రాయడం కూడా వారు నేర్పారు.



బీచ్‌లో విహరించే టూరిస్టులు

ఇంచుమించు 19 వ శతాబ్దం చివరి దాకా హవాయ్ దీవులు తమ స్వాతంత్ర్యం నిల బెట్టుకోగలిగాయి. ఆ తరువాత ఒక విప్లవం చెలరేగడంతో రాజరికం రద్దయి, రిపబ్లిక్ రాజ్యం ఏర్పడింది. 1898 నుంచీ ఇక్కడి ప్రజలకు అమెరికా (యునైటెడ్ స్టేట్స్)తో దగ్గర సంబంధం ఏర్పడింది. అమెరికన్ పౌరసత్వం కోసం ఇక్కడి ప్రజలు చేసిన అభ్యర్థనకు ఫలితంగా 1959 ఆగస్టు 21 న హవాయ్ దీవులు అమెరికన్ సంయుక్త రాష్ట్రాలలో 50 వ రాష్ట్రంగా చేర్చుకోబడ్డాయి.

ప్రస్తుతం 16,700 చ.కి.మీ.ల భూభాగంలో ఈ దీవులలో 8,98,000 మంది జీవిస్తున్నారు. జాతి గతంగా ఇక్కడి ప్రజలలో ఎక్కువ మంది ఆసియా, పసిఫిక్ ప్రాంతాల ప్రజలతో - ముఖ్యంగా జపాన్, ఫిలిప్పీన్ దీవులు, చైనా, కొరియాల ప్రజలతో - దగ్గిర సంబంధం గలవారు. హవాయ్ దీవులలోని జనాభాలో 6 వ వంతు మాత్రమే యూరప్ నుంచీ, అమెరికా నుంచీ వచ్చిన వారు.

తనకు మిక్కిలి సమీపంగా ఉన్న సోదర అమెరికన్ రాష్ట్రం కాలిఫోర్నియా కూ, హవాయ్ దీవులకూ మధ్య 3,200 కిలోమీటర్ల సముద్రం ఉంది. రుద్రాక్ష తావళం లాగ ఒక దాని ప్రక్కన ఒకటిగా వ్యాపించి ఉన్న ఈ 20 దీవుల సముదాయం పొడవు సుమారు 2,560 కి. మీ. లు. ఈ సముదాయంలో ఆగ్నేయపు కొసను 'హవాయ్' దీవీ, వాయవ్యపు కొసను 'కూరె' దీవీ

## మొదటి సారి శ్రోతల స్థాయికి దిగజారిన వక్త

హార్వర్డ్ యూనివర్సిటీ (అమెరికా) లోని సుప్రసిద్ధుడైన ప్రొఫెసర్ జార్జ్ లైమన్ కిట్రెడ్జ్ ఒక రోజున షేక్స్పియర్ క్లాసులో విద్యార్థులకు లెక్చరిస్తూ పొరపాటున కాలుజారి వేదికమీద నుంచి క్రిందికి పడ్డాడు. వెంటనే లేచి నుంచుని తన సహజ హాస్య ధోరణిలో "ఉపాధ్యాయుడుగా 40 ఏళ్ళ నా అనుభవంలో నేను శ్రోతల స్థాయికి దిగజారడం ఇదే మొదటి సారి!" అన్నాడు.

"అలవాట్లు ఆదిలో సాలె గూళ్ళు;
అనంతరం అవి ఇనుప గొలుసులు!" - స్పానిష్ సామెత

ఉన్నాయి. ఇక్కడ ఎండలు అంత తీవ్రంగా ఉండవు. సాధారణంగా ఇక్కడి ఉష్ణోగ్రత సంవత్సరం సగటు అయిన 75° ఫారన్‌హీట్‌కి దరిదాపులలోనే ఉంటుంది.

ఈ ద్వీప సముదాయంలో మిక్కిలి పెద్దదీవి అయిన హవాయ్ విస్తీర్ణం తక్కినదీవులన్నిటి



'హూలా' ప్రదర్శనలు

విస్తీర్ణానికీ 2 రెట్లు ఉంటుంది. ఈ దీవులలో మొత్తం 5 అగ్ని పర్వతాలు ఉన్నాయి. సజీవంగా ఉన్న రెండు అగ్ని పర్వాతాలలోనూ ఒకటి అయిన 'మౌనాలోవా' ప్రపంచంలోనే మిక్కిలి పెద్ద అగ్ని పర్వతం. 780 చ.కి.మీ.ల విస్తీర్ణం గల హవాయ్ జాతీయ పార్క్ ప్రక్కన ఉన్న ఈ పర్వతం ఎత్తు 4,200 మీటర్లు. ఈ పర్వతం దిగువను సముద్రం ఒడ్డునే పరిసర దీవి 'మావి' దాకా జాతీయ పార్క్ వ్యాపించి ఉంది.

హవాయ్ దీవులలో మిక్కిలి ప్రసిద్ధమైనదీ, విస్తీర్ణం దృష్ట్యా మూడవదీ అయిన 'ఓవాహూ' దీవి రాజకీయంగానూ, సాంస్కృతికంగానూ, వాణిజ్య దృష్ట్యానూ ఈ దీవుల సముదాయానికి హృదయం లాంటిది. 'ఓవాహూ' అనే మాటకు 'కూడలి' (gathering place) అని అర్థం. ఈ ద్వీప సముదాయానికి రాజధాని నగరం హోనోలూలూ. ఈ దీవిలోనే 'కూలా' అగ్ని పర్వత శ్రేణి పాదాల వద్ద 220 చ.కి.మీ.ల మేర వ్యాపించి ఉంది. హవాయ్ దీవుల జనాభాలో సగం పై చిలుకు ఈ నగరంలోనే నివసిస్తున్నారు.

'హోనోలూలూ'లో ముఖ్యంగా సందర్శించ దగ్గ వివిధ స్థలాలలో ఒకటి 'అయొలానీ' రాజ ప్రాసాదం. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కనిపించే ఏకైక రాజప్రాసాదం ఇదే! ఈ ప్రాసాదంలో ప్రాచీన హవాయ్ రాజుల సింహాసనాలూ, 'కాహిలిస్' అనే ఒక మనోహరమైన సముద్ర పక్షి ఈక, రాజవంశ లాంఛనాలైన మంత్ర దండాలూ భద్రపరచబడి ఉన్నాయి.

ఈ రాజ ప్రాసాదానికి అనతి దూరంలోనే 'కవైయాహావో' చర్చి ఉంది హవాయ్ దీవులకు ఇది 'వెస్ట్ మినిస్టర్ ఆబీ' (లండన్‌లోని ప్రధానమైన చర్చి) లాంటిది. చేరువనే న్యాయస్థాన భవనం దాని ముందు 'కామె

## లవంగాలు ఎక్కువగా దిగుమతి చేసుకునే దేశం

ప్రపంచంలో లవంగాలను ఎక్కువగా దిగుమతి చేసుకునే దేశం ఇండోనేషియా. ఆ దేశంలో క్రెటెక్ సిగరెట్ల ఉత్పాదనలో ఏటా 30,000 టన్నుల లవంగాలు వారికి అవసరం! ('అస్సాం రివ్యూ' సౌజన్యంతో)

"జ్ఞానం + ప్రేమ + శక్తి = జీవితం — హెచ్.ఎఫ్. అమిల్

హామెహా' రాజు శిలా ప్రతిమ ఉన్నాయి.

హోనోలూలూ లలిత కళల అకాడమీలో ఆసియా దేశాల నుంచి సేకరించిన అత్యద్భుతమైన చిత్రవస్తు సంచయం ఉంది. బిషప్ మ్యూజియంలో హవాయ్, పోలినేషియన్ జాతీయుల ప్రాచీన చిత్రవస్తు సంచయాన్ని భద్ర పరచారు. పెద్ద పెద్ద బౌద్ధాలయాలూ, 'చైనా టౌన్' అనే పేట, ఎన్నెన్నో అందమైన పార్కులూ ఈ నగరంలో మనల్ని ఆకర్షిస్తాయి.

పెరల్ హార్బర్ ఈ నగరానికి 11 కి.మీ.ల దూరంలో ఉంది. అమెరికా పసిఫిక్ నౌకాదళ స్థావరం ఇది. హోనోలూలూ నుంచి నిర్జీవమైన అగ్ని పర్వతం 'డైమండ్ హెడ్' దాకా విస్తరించి ఉన్న 'వైకికీ' బీచ్ టూరిస్ట్లకు గొప్ప ఆకర్షణ: వైకికీ బీచ్‌లో వారానికి ఎన్నోసార్లు ఆరుబయలు 'హూలా' ప్రదర్శనలు ఏర్పాటు చేస్తూ ఉంటారు. ఆ ప్రదర్శనలలో పోలినేషియన్‌లు ప్రధానంగా పాల్గొంటారు. మరొక ఆకర్షణ 'లువావూ' విందు: దీనిలో స్థానిక భక్ష్యాలు వడ్డిస్తారు. కొబ్బరి చెట్ల క్రింద ఆరుబయట ఈ విందులు జరుగుతాయి.

హోనోలూలూ ఓడ రేవుకి ఏటా వెయ్యి పైచిలుకు ఓడలు వస్తూ ఉంటాయి. ఇక్కడి అంతర్జాతీయ విమానాశ్రయం పసిఫిక్ మహాసముద్రంలో మిక్కిలి రద్దీ ఉన్న విమానాశ్రయం. ఏటా 2,46,000 విమాన యానాలను ఇది నిర్వహిస్తూంది సుమారు 2,50,000 మంది టూరిస్ట్లు ఏటా హవాయ్ దీవులను సందర్శిస్తారు. వారివల్ల 8.5 కోట్ల డాలర్ల ఆదాయం వస్తూంది.

వాహయ్ ద్వీప శ్రేణిలో ప్రతి దీవికీ దాని ప్రత్యేకత దానికుంది ఎప్పుడూ పచ్చగా కనిపించే 'కౌవై' దీవిని 'వన ద్వీపం' (Garden Island) అంటారు. సజీవ అగ్ని పర్వతం 'వైయాలీలె' ఈ దీవిలోనే ఉంది. ప్రపంచంలో వర్షపాతం మిక్కిలి ఎక్కువగా ఉన్న ద్వీపం ఇది. ఏటా సగటున ఈ ద్వీపంలో 470 అంగుళాల వర్షం పడుతుంది.

నిద్రాణమైన అగ్ని పర్వతం 'హాలీకీల' మావీ దీవిలో ఉంది. ఈ అగ్నిపర్వతంలో ఏర్పడిన పగులు (crater) ఎంత పెద్దదంటే

## ఇండియాలో నగర జనాభా పెరుగుదల



1981 జనాభా లెక్కల ప్రకారం ఇండియాలోని నగర జనాభా 15.6 కోట్లు. ఈ విషయంలో ప్రపంచంలో ఇండియా 4 వ స్థానంలో ఉంది. 1985 నాటికి రష్యా, అమెరికాలను కూడా మించిపోయి, చైనా తరువాత ఇండియాయే నగర జనాభాలో ప్రముఖ స్థానం ఆక్రమించగలదు.

"తెలిసినవాడు మాటలు పొదుపుగా వాడుతాడు!" —ఒక సామెత

న్యూయార్క్‌లోని 'మన్‌హటన్' దీవిని తేలికగా దానిలో పట్టించవచ్చు. ఈ దీవి పశ్చిమ ప్రాంతంలో 'లావో' లోయ విశాలంగానూ, నిత్య శ్యామలంగానూ కనిపిస్తుంది. ఈ దీవిలోని 'లహైనా' ఒకప్పుడు 'హవాయ్' రాజ్యానికి రాజధానిగా ఉండేది. ప్రస్తుతం ఇది ప్రశాంతంగా నిద్రిస్తున్నట్టు కనిపించే ఒక చిన్న పట్టణం.

పశ్చిమాన ఉన్న చిన్న చిన్న దీవులలో హవాయ్ దీవుల తాలూకు పక్షి సంరక్షణ కేంద్రం నెలకొల్పారు. ప్రపంచంలో ఇతరత్రా కనిపించని అపురూపమైన జాతుల పక్షులను కొన్నిటిని ఇక్కడ పెంచుతున్నారు.

అగ్ని పర్వతాల నుంచి ప్రవహించే లావా ద్రవంతో ఏర్పడిన ఈ దీవులలోని సారవంతమైన నేలను శాస్త్రీయ సాగు పద్ధతులతోనూ, మానవ కల్పితమైన నీటి వనరులతోనూ సాగు చేస్తున్నారు. హవాయ్ దీవులలోని రైతు కూలీల వేతనాలు చాలా ఎక్కువ. ఇంధనాల వనరులు గాని, గంధకం తప్ప వేరే ఖనిజాలు గాని లేకపోయినా హవాయ్ దీవులలో అనేక పరిశ్రమలు వెలిశాయి. ఒక్క హోనోలూలూ నగరంలోనే 160 రకాల వస్తువులు ఉత్పత్తి చేస్తున్నారు. 27 చక్కెర కంపెనీల వారు నాలుగు దీవులలో 88,000 హెక్టేర్లలో చెరుకు పండిస్తున్నారు.

రెండో ప్రధానమైన పంట - అనాస. అయిదు దీవులలో దీనిని పండిస్తున్నారు. సుమారు 30,400 హెక్టేర్ల భూమి అనాస పంట క్రింద ఉంది. ఇతర పంటలలో ముఖ్యమైనవి: కాఫీ, కాయగూరలు, పువ్వు కాయలు.

హవాయ్ దీవులలోని ప్రధాన పరిశ్రమలు: టూరిజమ్, చక్కెర పరిశుద్దీ కరణం, చేపలు పట్టడం. చలన చిత్ర పరిశ్రమ ప్రధానమైన ఎగుమతులు: చక్కెర, డబ్బాలలో భద్రపరచిన అనాస పళ్ళు, వస్త్రాలు, ఆహార పదార్థాలు.

హవాయ్‌లో షాపింగ్ ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. ప్రపంచం నలుమూలల నుంచీ వచ్చే వస్తువు లన్నీ ఇక్కడి దుకాణాలలో దొరుకుతాయి. ఇక్కడి 'అలమోనా' షాపింగ్ సెంటర్ ప్రపంచం అంతటిలోకీ మిక్కిలి పెద్దది!

## సర్వేంద్రియాణాం నయనం ప్రధానం!



ఈ ప్రపంచంతో మనిషి అనుబంధం ప్రధానంగా అతని కళ్ళ మీదే ఆధారపడి ఉంది.

1. అతడు సాధించే జ్ఞానంలో 83 శాతం కళ్ళ వల్లనే లభిస్తుంది.

2. అతని చేతలలో 80 శాతాన్ని కళ్ళే నడుపుతాయి.

3. అతని శక్తిలో 50 శాతం దాకా కళ్ళ వినియోగించుకుంటాయి!

"'దయ' దయను పుట్టిస్తుంది!" -సోఫోక్లీజ్

# బహుమతి పొందిన వ్యాసం

## సిక్కు మతం విశిష్టత

వి. విద్యాసాగర్, తాడిపత్రి

ప్రపంచంలోని మతాలలో సిక్కుమతం మిక్కిలి ఆధునిక మైంది. ప్రపంచంలోని అన్ని మతాలలోని ధర్మాలను - ముఖ్యంగా హిందూ, ముస్లిమ్ ధర్మాలను - సమన్వయించు కొని సముద్భవించింది సిక్కు మతం. ఈ మతం ప్రవక్త నానక్ (జననం క్రీ.శ. 1469). మతా లన్నీ భగవంతుడు దయామయు డని కీర్తిస్తున్నా మతాల పేరిట మానవుడు పరస్పర కలహాలకు దిగి రక్తపాతం కలిగిస్తూ ఉండ డం చూపి బాధపడి నానక్ సర్వమత సౌభ్రాత్రాన్ని ప్రకటిస్తూ ఈ సిక్కుమతం స్థాపించాడు. ముస్లిమ్‌లలో ఉన్న పరమత అసహనాన్నీ, తీవ్ర మతావేశాన్నీ చూసి ఆయన వేదన చెందాడు. ఈ నూతన మతం ద్వారా నిరాడంబరతతో కూడిన విశ్వాసాన్నీ, పవిత్రమైన జీవన విధానాన్నీ ఆయన ప్రబో ధించాడు. కాలక్రమేణ ముస్లిం పాలకులు సిక్కులను బహు విధాలుగా పీడించడంవల్ల స్వీయమత రక్షణ కోసం వారు యుద్ధానికి సన్నద్ధులు కావలసి వచ్చింది. గురు గోవింద్ సింగ్ (1666-1708) నాయకత్వం క్రింద

### ఇండియా యుద్ధ నౌక ఐ.ఎన్.ఎస్. గోదావరి



జాతీయంగా నిర్మించ తల పెట్టిన 3 పెద్ద యుద్ధ నౌకలలో మొదటిదైన 'ఐ ఎన్.ఎస్. గోదావరి' క్రిందటేడు డిసెంబరు నెలలో బొంబాయిలో జల ప్రవేశం చేసింది. భార తీయులు గర్వించ దగిన గొప్ప యుద్ధ నౌక అది. ఒక స్థలం నుంచి మరో స్థలానికి క్షిపణులను ప్రయోగించే సౌకర్యంతో ఇండియాలోనే డిజైన్ చేసి నిర్మించిన మొట్ట మొదటి యుద్ధ నౌక అదే! యుద్ధ చర్యల భోగట్టా తెలిపే కంప్యూటరూ, రాడార్ సౌక ర్యాలలాంటి హంగులన్నీ దానిలో అమర్చారు.

"నా అజ్ఞానపు ముఖాన్ని తప్ప నేను మరి దేనినీ ఎరుగను!" —సోక్రటీస్

సిక్కులు తమను హింసించిన వారిని ధైర్యంగా ఎదిరించి తమ మతాన్ని రక్షించుకున్నారు. సింహంపలె పోరాడేవారు కనుక సిక్కులపేర్ల చివర 'సింగ్' అనే పదం చేర్చబడుతూ వచ్చింది. సిక్కుల పవిత్ర గ్రంథం 'ఆది గ్రంథ్'. సిక్కుల దేవాలయాలను 'గురుద్వారాలు' అంటారు.

* * *

ఇంద్రగంటి (శ్రీ) గీత, విశాఖపట్టణం.

సిక్కు మతం హిందూ మతంలో ఒక ప్రత్యేక శాఖ: ఈ మత ప్రవక్త గురునానక్. ఆయన వారసుడు అంగద్. ఆయన నియమించిన 8 మంది గురువులు సిక్కు మతంలో గురుపీఠ సంప్రదాయాన్ని నెలకొల్పారు.

లౌకిక, ఆధ్యాత్మిక రంగాల మధ్య సమన్వయం సాధించడం సిక్కు మతం విశిష్ట లక్షణం. వారి పవిత్ర 'అమృత సరోవరం,' 'స్వర్ణ దేవాలయం' నాలుగో గురువైన రామదాసు కాలంలో ప్రారంభించబడి ఐదో గురువైన అర్జున్‌సింగ్ కాలంలో పూర్తి గావించబడ్డాయి. ఈయనే నానక్ బోధనలను సంకలనం చేసి 'ఆదిగ్రంథ్' అనే సిక్కు వేదాన్ని కూర్చారు.

సిక్కుల చివరి గురువు గోవింద్ సింగ్ సిక్కులను సైనిక జాతిగా తీర్చిదిద్దారు. వారిని 'ఖాల్సా' (పవిత్ర సైన్యం) అంటారు. 'ఖాల్సా'లో సభ్యులు అమృత సరోవరంలోని నీటిని ఖడ్గధారతో తాగి, పవిత్రమైన దీక్ష వహించాలి. మరియు వారు పంచ 'క' కారాలను ధరించాలి. అవి: 1. కంఘీ (దువ్వెన),

## కళా సృష్టికి వయస్సు ప్రతిబంధకం కాదు



అన్నా మోసెస్ అనే అమెరికన్ చిత్రకారిణి 100 ఏళ్ళ వయస్సులో కూడా చిత్రిస్తూనే ఉన్నారు. తన 94 వ ఏట ఆంగ్ల తత్వవేత్త బెర్ట్రాండ్ రసెల్ అంతర్జాతీయ శాంతి సాధనకు ఉద్యమం నడిపాడు. తన 93 వ ఏట సుప్రసిద్ధ బ్రిటిష్ నాటకకర్త జార్జ్ బెర్నార్డ్ షా 'ఫార్ ఫెచ్‌డ్ ఫేబిల్స్' అనే నాటకం వ్రాశాడు. స్పానిష్ చిత్రకారుడు పాబ్లోపికాసో తన 90 వ ఏట కూడా చిత్రాలు వేశాడు. ఆల్సేషియన్ డాక్టర్ ఆల్బర్ట్ ష్వైట్జర్ 89 వ ఏట ఆఫ్రికాలో ఆసుపత్రి నడిపాడు. 84 వ ఏట సోమర్ సెట్ మామ్ 'పాయింట్స్ ఆఫ్ వ్యూ' అనే రచన చేశాడు. మాజీ బ్రిటిష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ 'ఆంగ్ల భాషా భాషుల చరిత్ర' (A History of English speaking people) వ్రాసింది తన 82 వ సంవత్సరంలో!

జ్ఞానం గొప్ప శక్తి!" —హాబ్స్

2. ఖజ్ (పొట్టి షరాయి) 3. ఖర్ద్ (చాకు), 4. కేశ్ (పొడవైన శిరోజాలు), 5. కృపాణ్ (పొడవైన ఖడ్గం)

'ఇద్దరు సిక్కులు పదిమంది గురువులతో సమానం' అనీ, 'ఐదుగురు సిక్కులు చేరిన చోట భగవంతుడు ఉంటాడు' అనీ అంటారు. దేశభక్తికీ, ఐకమత్యానికీ వారు ప్రతీకలు.

ఎస్.ఎన్. హుస్సేన్,
నాగార్జునసాగర్.

"సమస్తమూ భగవంతునిలో ఉంది. భగవంతుడు సమస్తంలోనూ ఉన్నాడు. భగవంతుణ్ణి కీర్తించేవాడు సంసారంనుంచి విముక్తుడవుతాడు" అని ప్రధానంగా సిక్కుమతం బోధిస్తుంది.

పంజాబ్‌లో 'రావీ' నది ఒడ్డున ఉన్న తల్వండీ అనే గ్రామంలో 1469 వ సంవత్సరంలో జన్మించిన గురు నానక్ ఒక నాడు రావీ నదిలో స్నానం చేస్తూ ఉండగా "నానక్! నేను నీకు తోడుగా ఉన్నాను. నిన్ను ఉత్తమ మానవుడుగా మలుస్తాను నీవు నా మహిమను ప్రపంచానికి వెల్లడి చెయ్యి!" అనే మాటలు వినిపించాయి. దేవుని ఆదేశానుసారమే నానక్ సిక్కుమతాన్ని స్థాపించాడు.

కబీర్‌లాగే నానక్ కూడా కులభేదాలనూ, మూఢ మతాచారాలనూ నిరసించాడు. దేవుడు ఒక్కడే అని దృఢంగా విశ్వసించాడు. నానక్ బోధన లన్నీ స్తోత్రాల రూపంలో ఉన్నాయి. ఆదిగ్రంథం (గ్రంథ్ సాహెబ్)లో అవి పొందుపరచబడి ఉన్నాయి. సత్యం, క్షమ, ధ్యానం - ఈ మూడింటి ఆవశ్యకతనూ ఈ గ్రంథం వివరిస్తుంది. 'మానవు లందరూ సమానులే! అందరూ సహోదరులే!' అని ప్రధానంగా సిక్కుమతం చాటుతుంది.

## 'చుండు' వ్యాధి అల్ట్రా వయొలెట్ రశ్ముల చికిత్స



ప్రస్తుతం ప్రపంచంలో తల మీద 'చుండు' వ్యాధితో 60 కోట్ల మంది బాధపడుతున్నారు. దీని నివారణకు అల్ట్రా వయొలెట్ కిరణాల ప్రసారం అమోఘంగా పని చేస్తుంది. జుట్టుకు తగలకుండా తలమీది పొలుసులకు నేరుగా ఆ కిరణాలు సోకడానికి వీలుగా బవేరియాలోని లాండ్స్ బర్గ్‌లో 'ఆవరిన్' అనే జర్మన్ సంస్థ ఒక కొత్త పరికరం తయారు చేసింది. అల్ట్రావయొలెట్ కిరణాలను ప్రసరించే దీపంతో పాటు గాలి ఊది వెంట్రుకలను ఒక ప్రక్కకు నెట్టివేసే భాగం కూడా అమర్చబడిన ఈ పరికరం ఒక కిలోగ్రాము బరువు ఉంటుంది.

---

"జడ్జికి ఉండవలసిన సుగుణాలు: నెమ్మదిగా వినడం, తెలివిగా బదులు చెప్పడం, శాంతంగా ఆలోచించడం, నిష్పక్షపాతంగా తీర్పుచెప్పడం!" —సోక్రటీస్

# ప్రపంచ వార్తలు

## స్త్రీలకు సమాన బాధ్యత కల్పించే చట్టం:

కుటుంబానికి సంబంధించిన అన్ని నిర్ణయాలలోనూ స్త్రీలకు పురుషులతో సమానమైన బాధ్యత కల్పిస్తూ గ్రీస్ దేశపు పార్లమెంటు ఇటీవల ఏకగ్రీవంగా ఒక శాసనం చేసింది. ఇంతవరకూ కుటుంబ వ్యవహారాలలో పురుషులదే తుది నిర్ణయంగా ఉంటూ వచ్చిన 'పైత్రుక వ్యవస్థ' (paternal system)కు ఈ శాసనం ఇప్పుడు స్వస్తి చెప్పింది

* * *

## అద్భుత శక్తి గల కొత్త 'చిప్':

ఒక సుప్రసిద్ధ జపనీస్ ఎలెక్ట్రానిక్ కంపెనీవారు మిక్కిలి చిన్న కంప్యూటర్‌లలో వాడుక చేయదగిన అద్భుతమైన ఒక కొత్త 'చిప్'ను తయారు చేశారు. ఇంతవరకూ వ్యక్తిగత కంప్యూటర్‌లలో వాడుక చేస్తూ వచ్చిన '64-కె' స్మృతి 'చిప్'ల స్థానే ఈ కొత్త చిప్‌ను వాడడంవల్ల చేతిగడియారం అంత చిన్నసైజు కంప్యూటర్‌లు తయారు చేయవచ్చును. చాలా కొద్ది స్థలంలో, రికార్డు సంఖ్యలో ట్రాన్సిస్టర్‌లనూ, రెగ్యులేటర్‌లనూ ఇముడ్చుకోగల శక్తి ఈ 'చిప్'కు ఉంది.

* * *

## జపాన్‌లో 'సూపర్ రొబట్'ల ఉత్పాదనకు జరిగే కృషి:

మంటలు చల్లార్చడం, అణువిద్యుత్ యంత్రాన్ని నిర్వహించడం సఁ దం అడుగున పఁశోధనలు చేయడం వంటి కష్టమైన పనులు నిర్వర్తించే 'సూపర్ రొబట్' (మర

## షార్క్ చేప అద్భుత జీర్ణశక్తి



పెద్ద సైజు మాంసాహారి చేప అయిన షార్క్ జీర్ణశక్తి ఆశ్చర్యకరం। దాని జఠరం (కడుపు)లో ఎలాంటి వస్తువులనైనా జీర్ణం చేయగల ఒక ఆమ్ల రసం ఊరుతుంది పట్టుబడిన ఒక షార్క్ చేప కడుపు కోసి చూడగా దానిలో ఆ ఆమ్లరసం వల్ల నుసినుసి అయిపోతున్న ఒక గుర్రపు నాడా కనిపించింది. ఆ ఆమ్ల ద్రవాన్ని మనిషి వంటి మీద వేస్తే కాలినట్టు అక్కడ చర్మం ఊడి వస్తుంది.

"జంతువులంత మంచి మిత్రులు దొరకడం కష్టం:
అవి ప్రశ్న లడుగవు; మనల్ని విమర్శించవు।" —జార్జ్ ఇలియట్

మనుషులు) లను ఉత్పాదన చేసేందుకు జపాన్ ప్రభుత్వ పరిశోధన సంస్థలలో తీవ్రమైన కృషి జరుగుతూంది. 8 ఏళ్ళపాటు సాగే ఈ ప్రోజెక్టుకు 2,000 కోట్ల యెన్‌లు (రూ. 86 కోట్లు) ఖర్చు అవుతుంది. చూడడం, వినడం, వాసన చూడడం వంటి వివిధ శక్తులను ఈ రాబట్‌లకు కలిగిస్తారు. పలు చేతులు గల ఈ మర మనిషి ఎగుడు దిగుడు నేలమీద కూడా సునాయాసంగా నడవగలడు.

* * *

## ఫ్రాన్స్ కనిపెట్టిన 'కృత్రిమ రక్తం':

ఫ్రాన్స్‌లో ఒక కొత్తరకం కృత్రిమ రక్తం త్వరలోనే భారీ ఎత్తున ఉత్పత్తి కాబోతూంది. జపాన్, అమెరికన్ కృత్రిమ రక్తాలలో లాగానే ఫ్రాన్స్ కనిపెట్టిన కృత్రిమ రక్తంలో కూడా 'ఫ్లూరో కార్బన్'లు ప్రధాన పాత్ర వహిస్తూ, ప్రాణవాయు వాహకాలుగా పనిచేస్తాయి. కాని ఇది వాటికంటె మరింత స్వచ్ఛమైంది, మరింత పటిష్ఠమైంది. అంతే కాక, భారీ ఎత్తున ఉత్పత్తి చేయడానికి వీలైనది.

## నౌకా ప్రమాదాలను నివారిస్తున్న 'శాటిలైట్'లు:

యునెస్కో (UNESCO) వారి నివేదిక ప్రకారం ప్రతి ఏడాదీ భూమి చుట్టూ తిరుగుతున్న కృత్రిమ ఉపగ్రహాలు 400 ఓడలను ప్రమాదంలో చిక్కుకోకుండా కాపాడుతున్నాయి.

* * *

(మిగతా 39 వ పేజీలో)

## మిక్కిలి బరువైన మనిషి



సృష్టిలో మిక్కిలి బరువైన మనిషి ఇల్లినాయిస్ (అమెరికా) రాష్ట్రంలోని మూంటిసెల్లోకి చెందిన - 6 అడుగుల, 1/2 అంగుళం ఎత్తు ఎదిగిన - రాబర్ట్ ఎర్ల్ హ్యూజెస్ 1958 ఫిబ్రవరి నెలలో అతని బరువు 1,069 పౌన్ల స్థాయికి పెరిగింది. 1958 జూలై 10 వ తేదీన తన 32 వ ఏట 'యురీమియా' (రక్తంలో మూత్రం అధికంగా చేరడం) అనే వ్యాధితో అతడు చనిపోయాడు. పియానో పెట్టె అంత శవపేటిక తయారు చేయించి అతని మృత దేహాన్ని ఖననం చేశారు.

"ధనికుడుగా చావా లని దరిద్రుడుగా
బ్రదకడం కేవలం ఉన్మాదం!" —జూవెనాల్

# మారిపోతున్న పల్లెటూళ్ళు

శ్రీ ఎన్. ఎస్. వెంకటరామన్

ఈ బొంబాయి మహా నగరంలో రాత్రిళ్ళు నిద్ర పట్టక తరుచు నేను జాగరణ చేస్తూ ఉంటాను. అలాంటి రాత్రిళ్లు నగర శివార్లలో



నేను అద్దెకున్న పాత బిల్డింగ్‌లో డాబా మీదికి వెళ్ళి వెల్లకిలా పడుకొని నక్షత్రాల కేసి చూస్తూ చిన్న నాటి రోజులు నెమరు వేసు కుంటూ ఉంటాను. క్షణం తీరిక లేని నగర జీవితం అంటే ప్రాణం విసుగు పుట్టి ప్రశాంతంగా, పవిత్రంగా ఎలాంటి తొందరా లేని గ్రామీణ జీవితం కోసం ఎదురు చూస్తూ ఉంటాను. అలాంటప్పుడు ఏమైనా సరే ఆ మర్నాడే మా స్వగ్రామానికి టికెట్ రిజర్వ్ చేసుకు రావాలి అని అనిపిస్తుంది. మా స్వగ్రామానికి ప్రయాణం కట్టినప్పుడల్లా పసి పిల్లవాడి లాగ సంతోషంతో నా మనస్సు గంతులు వేసుంది.

మా ఊరు వదలి తిరిగి బొంబాయి వస్తూ ఉంటే దారి పొడుగునా తీరని బెంగతో, బాధతో నా గుండె బరువెక్కి పోతుంది.

తెలతెల వారుతూ ఉండగా సాధారణంగా మా ఊరు ప్రక్కన ఉన్న స్టేషన్‌లో నేను రైలు దిగుతాను. ఎలాంటి కాలుష్యం లేని ఆ గ్రామీణ వాతావరణాన్ని అనుభవిస్తూ స్టేషన్‌కి రెండు మైళ్ళ దూరం ఉన్న మా ఊరికి నడిచే వెళ్ళడం నాకు సరదా! స్వచ్ఛమైన ఆ గాలీ, సహజత్వం ఉట్టిపడే ఆ ప్రకృతి శోభ నన్ను పరవశుణ్ణి చేస్తాయి. అక్కడ ఉన్నన్ని రోజులు ప్రతి రోజూ ప్రొద్దున్నే ప్రక్కన ఉన్న నదికి స్నానానికి వెళతాను.

## 100 ఏళ్లలో అల్యూమినియం కరువు

ప్రపంచం అంతటా అల్యూమినియమ్‌ని బాక్సైట్ నుంచి రాబడుతున్నారు. ఏటా 10 కోట్ల టన్నుల బాక్సైట్‌ను గనుల నుంచి త్రవ్వి తీస్తున్నారు. భూగర్భ శాస్త్రజ్ఞుల అంచనాల ప్రకారం ప్రపంచంలో మొత్తం బాక్సైట్ నిలువలు 1,000 కోట్ల టన్నులు మాత్రమే ఉన్నాయి. అందుచేత 100 ఏళ్ళలో ప్రపంచంలో బాక్సైట్, దాని నుంచి తీసే అల్యూమినియమ్ కరు వయిపోతాయి.

"ఆకాశం ఊడిపడ్డా, న్యాయం జరిగేట్టు చూడు!" —డబ్ల్యు. వాట్‌సన్

స్నానం అయి రాగానే రక రకాల భక్ష్యాలతో అమ్మ నాకు 'నాస్తా' సిద్ధం చేస్తుంది. మళ్ళీ మధ్యాహ్నం భోజనం. పెద్ద అరటి ఆకు వేసి దొడ్లో కాసిన తాజా కూరలు కోసి తెచ్చి చేసిన రక రకాల ఆదరువులతో ప్రేమగా పక్కన కూచుని అమ్మ అన్నం తినిపిస్తుంది. ఆ తరువాత ఒక చిన్న కునుకు తీసి లేవగానే తియ్య మామిడికాయ ముక్కలూ, ఉప్పు - కారంతో ప్లేట్ ఎదురుగా ప్రత్యక్షం అవుతుంది. వాటి రుచి సరి దేనికీ రాదు. ప్రొద్దు కూకిం తరువాత ఒక హరికెన్ లాంతరు చేత బుచ్చుకుని గుడికి బయలు దేరుతాను. మర్రిచెట్టు కొమ్మల మీద కూచున్న కాకుల అరుపులూ. గుడిచుట్టూ ప్రమిదలలో వెలిగించిన దీపాల వయ్యారి నాట్యాలూ, గుళ్లో పూజారి మోగించే గంటలూ - అన్నీ అద్భుతమైన శ్రుతిలో మిళితమై మనస్సును ఆనంద పరుస్తాయి హాయి, శాంతి నిండిన మనస్సుతో ఇంటికి తిరిగి వస్తాను.

అయితే - ఇటీవల నేను మా ఊరు వెళ్ళినప్పుడు చూస్తే - అక్కడ పరిస్థితు లన్నీ పూర్తిగా మారిపోయాయి. సహజమైన అలంకరణలూ, దుస్తులూ మాని, ఆధునిక దుస్తులతోనూ, అలంకరణలతోనూ కనిపించే పల్లెటూరి పిల్లలాగ ముస్తాబైంది ఇప్పుడు మా ఊరు. స్టేషన్ నుంచి మా ఊరు దాకా రోడ్డుకి రెండు వైపులా ఇళ్ళు, గారేజ్‌లూ వెలిశాయి. గత కాలానికి సాక్షులుగా అక్కడొకటీ, అక్కడొకటీ మాత్రమే వెనుకటి గుడిసెలు మిగిలి ఉన్నాయి. మా ఊరికి కరెంటు

## విచిత్ర జంతు



ఆఫ్రికాలో సహారా ఎడారి దక్షిణ ప్రాంతంలోనూ, సూడాన్‌లోనూ ఎక్కువగా కనిపించే స్తనంధయ జాతి (mammal) కి చెందిన ఒక 'విచిత్ర జంతువు' ఆర్డ్‌వార్క్ (aardvark) అరడుగుల పొడుగు దాకా ఎదిగే ఈ జంతువు వాడి అయిన గోళ్ళతో నేలలో కలుగులు తవ్వి వాటిలో నివసిస్తుంది. రాత్రిపూట ఇది వేటకు బయలుదేరుతుంది. ఈ జంతువుకు ప్రధానమైన ఆహారం - చీమలూ, చెదపురుగులూ! చెదల పుట్టలను తన వాడి గోళ్ళతో ఛేదించి ఒంటరిగానే వేటాడుతూ తన పొడుగైన జిగట నాలుకతో అది చెద పురుగులను పట్టి అరగిస్తుంది. తన సురంగంలోకి శత్రువు ఏదైనా వస్తే విపరీతమైన వేగంతో క్రొత్త సురంగం తవ్వుకుని అది తప్పించుకు పోగలదు ఆఫ్రికాకు వలస వెళ్ళిన డచ్‌వారు దీనిని 'నేల పంది' అన్నారు. 'చీమల గొలుగుబంటి' అని కూడా దీనిని అనడం కద్దు.

"నువు సుఖంగా బ్రదుకు; పరులను సుఖంగా బ్రదుకనీ!
ఇంతకంటె సరళమైన సూత్రం మరొకటి లేదు!" - సర్ ఆర్. లెస్ట్రేంజ్

వచ్చింది. ఇంటింటా రేడియో వెలసింది. బొంబాయిలో ఏడాది పొడుగునా వినిపించే ఆ పాత సినీమా పాటలే అక్కడా చెవులు హోరెత్తించాయి.

వెనుకటి రోజులలో అయితే పగలంతా చెమటోడ్చి పని చేసిన రైతు యువకులు సాయం సమయాలలో పచ్చని చేల మధ్య గొంతెత్తి పాడే అద్భుతమైన జానపద గీతాలు వింటూ మైమరచిపోయే వాణ్ణి గుడిలోనూ, గుడి చుట్టూ ఇప్పుడు ట్యూబ్ లైట్లు వచ్చాయి. సభలూ, సమావేశాలూ జరుపుకునేందుకు ఆ పక్కనే ఒక హాలు నిర్మించారు. ఎప్పుడు చూసినా గ్రామంలోని నిరుద్యోగులంతా చేరి అక్కడ పేకాడుతూ ఉంటారు.

ఒకప్పుడు ఒంటరిగా, పవిత్రంగా ఉన్న మా గ్రామంలో ఇప్పుడు వచ్చిన ఈ 'నూతనాభివృద్ధి'కి తట్టుకోలేక వీలైనంత త్వరలో నేను బొంబాయికి తిరుగు ప్రయాణం కట్టాను. దేశం అంతటా జరుగుతున్న ఆర్థికాభివృద్ధినీ, ఆధునికీకరణనూ గురించిన నా అజ్ఞానం చాలా మందికి నవ్వు తెప్పించవచ్చును కాని, నా లాగ పల్లెటూళ్ళో పుట్టి పల్లెటూళ్ళో పెరిగిన వారు నా బాధను అర్థం చేసుకోగలరు. మాలాంటి వాళ్ళను 'సెంటిమెంటలిస్ట్' అని తేలికగా కొట్టి పారెయ్యడానికి వీలులేదు. ఏమంటే ఆ 'సెంటిమెంట్స్'లోనే మన నిజమైన ఆశలూ, మన నిజమైన బ్రదుకూ ఇమిడి ఉన్నాయి. మన విశిష్ట జీవన విధానానికి అవి దర్పణాలు!.

## ప్రతి అదనపు పౌరుడికిందా అయే ఖర్చు రూ. 7,000 లు



"ప్రతి అదనపు పౌరుడికీ తిండి వసతులు, పరిచర్యలు వగైరా సరఫరా చేయడానికి మన జాతికి అయే పెట్టుబడి ఖర్చు - ప్రస్తుతం ఉన్న తక్కువ స్థాయి వసతుల దృష్ట్యా కూడా - రూ. 7,000లు అని అంచనా వేశారు. సగటున ఒక్కొక్క దంపతుల జంటకు నలుగురు పిల్లలు పుడతారని లెక్క వేసినా, ఈ తరంలో ఒక్క శిశువు జననాన్ని నిరోధిస్తే, తరువాతి రెండు తరాలలో ఆరుగురు శిశువుల జననాన్ని నిరోధించినట్టు అవుతుంది. ఆ విధంగా మన జాతికి రూ. 42,000 లు ఆదా చేసిన వాళ్ళం అవుతాము. అందుచేత ఐచ్ఛికంగా ఆపరేషన్ చేయించుకునే వారికి రూ. 1,000 లు కాదు; రూ. 5,000 ఇచ్చినా అది మన యుక్తమే కాగలదు. 5 కోట్ల మంది ఇప్పుడు ఆపరేషన్‌లు చేయించుకుంటే 2,080 నాటికి మన జనాభాలో 30 కోట్లు తగ్గుతుంది."

జె. ఆర్. డి. టాటా

"ఒకే ఒక మేలు: జ్ఞానం! ఒకే ఒక కీడు: అజ్ఞానం!" —డయోజినిస్

# కార్టూనులు గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 37

## స్కెచ్ బుక్

స్కెచ్‌బుక్ ఎప్పుడూ వెంట ఉంచుకునే అలవాటు కార్టూనిస్టుకి చాలా ముఖ్యం. తెల్ల కాగితాలతో కుట్టిన స్కెచ్‌బుక్ నిరం



తరం మీ జేబులో ఉండాలి. లెటర్‌పాడ్ లాగా క్రింద గట్టి అట్ట, పైన పచలని అట్ట వేసి స్కెచ్‌బుక్ తయారు చేసుకోవాలి.

రోడ్లమీద పోతున్నప్పుడు గాని, హోటళ్ళ లోనో, రైల్వేస్టేషన్‌లలోనో, బస్‌స్టాండ్ లోనో గాని చిత్రమైన దృశ్యాలు కనిపిస్తే అప్పటికప్పుడు వాటిని మీ స్కెచ్‌బుక్‌లో గీసి భద్రపరచుకోవాలి. అవయవ విన్యాసం చిత్రంగా ఉన్న మనుష్యులూ, విచిత్రమైన దుస్తులూ, విచిత్ర భంగిమలూ కనిపిస్తే వెంటనే స్కెచ్‌బుక్‌లో వాటిని గీసుకోవాలి. ఈ స్కెచ్‌లను పెన్‌తోనే వేసుకోండి. ఇవి

---

## మిక్కిలి కచ్చితమైన గడియారం

ప్రపంచంలో మిక్కిలి కచ్చితమైన గడియారం 'పల్సార్' నక్షత్రం. మనం నమ్మలేనంత వేగంగా - సెకనుకు 600 సార్లు - అది తన చుట్టూ తాను తిరుగుతుంది. పరమాణు గడియారాలలోని స్పందనల (vibra- tions) కంటె కూడా ఈ పల్సార్ పరిభ్రమణాలు మరింత క్రమబద్ధమైనవీ, కచ్చితమైనవీ అనీ, మరింత నిక్కచ్చిగా కాలాన్ని కొలవాలని ఆరాటపడే శాస్త్రవేత్తలు భవిష్యత్తులో తమ గడియారాలకు 'పల్సార్'తో అనుబంధం చేకూర్చుకోడం జరుగవచ్చు ననీ ప్రిన్స్‌టన్ యూనివర్సిటీ ఖగోళ శాస్త్రవేత్త జె. హెచ్. టెయిలర్ భావిస్తున్నారు.

---

చిత్తు స్కెచ్‌లు. కొద్ది రేఖలతో కొన్ని సెకన్‌లలో, లేదా కొన్ని నిముషాలలోనే వాటిని గీసుకోవాలి.



పరిసరాలను కూడా నోట్ చేసుకోవాలి. ఏదైనా చిత్రమైన సన్నివేశం ఎదురైతే దానిని సమగ్రంగా మీ స్కెచ్ బుక్‌లో నమోదు చేసుకోవాలి. ఉదాహరణకు - కోర్టు, రైలుస్టేషన్, సినీమాహాలు, మార్కెట్, బీచ్, పార్కు, క్రీడాస్థలం-ఇలాంటివి. పరిసరాలను పరిశీలిస్తూ స్కెచ్‌బుక్‌లలో నమోదు చేసుకుంటూ ఉండే అలవాటు మీకు చాలా మేలు చేస్తుంది. కొన్ని కొన్ని భవనాలు, రకరకాల చెట్లు, వివిధ వాహనాలు - అన్నిటినీ స్కెచ్‌బుక్‌లో గీసుకోవచ్చును. స్కెచ్ బుక్‌లో ఇలా గీసుకోడం ఒక హాబీగా చేసుకోవాలి. దీనివల్ల మీ కళాకౌశలం మెచ్చుకొని మిమ్మల్ని అభిమానించేవారు కూడా కొందరు తయారవుతారు.

ఇలాంటి నిరంతరాభ్యాసంవల్ల స్కెచ్‌లు గీయడంలో వేగం, నైపుణీ మీకు అలవడుతాయి. ఇవి కార్టూనిస్టులకు ఎంతగానో తోడ్పడుతాయి! (సశేషం)

---

(34 వ పేజీ తరువాయి)

## రష్యాలో తవ్వుతున్న మిక్కిలి పెద్ద ఇరిగేషన్ సురంగం:

రష్యాలోని ఇరిగేషన్ సురంగా లన్నిటిలోకి మిక్కిలి పెద్దదైన డంగారా ఇరిగేషన్ సురంగం తజికిస్థాన్‌లో మిక్కిలి ప్రతికూలమైన పరిసరాలలో నిర్మించబడుతూంది. 14 కి.మీ. ల పొడవుగల ఈ సురంగంలో 8 కి. మీ ల సురంగం త్రవ్వకం పూర్తి అయింది. తజికిస్థాన్‌లో 90 శాతం నేల పర్వత ప్రాంతం. వాక్షనది మీద మానవ కల్పితమైన 'నూరెక్' సాగరం నుంచి తవ్వబడుతున్న ఈ భూగర్భ కాలువ ఎడారి లాంటి డంగారా పీఠభూమిలో వేల కొద్దీ హెక్టేర్‌లను సాగు క్రిందికి తెస్తుంది.

## మొహెంజోదారో శిథిలాల సంరక్షణకు పథకం:

యునెస్కో వారూ, పాకిస్థాన్ ఆర్కియాలజీ డిపార్టుమెంట్ వారూ కలిసి క్రీ పూ. 5,000 సం. ల నాటి మొహంజోదారో శిథిలాలను సంరక్షించేందుకు 1.8 కోట్ల డాలర్‌లు వ్యయం కాగల ఒక సమగ్ర పథకాన్ని రూపొందించారు.

"నీ సత్తాను బట్టి నీకు నీవు విలువ కట్టుకుంటే
నీవు సాధించిన పనులను బట్టే లోకం నిన్ను గణిస్తుంది!" —లాంగ్ ఫెలో

# రానున్న అయిదోతరం కంప్యూటర్‌లు

టోకియో (జపాన్)లోని మిక్కిలి ఎత్తైన ఒక 'స్కై స్క్రేపర్' భవనంలోని 21 వ అంతస్థులో ఎలెక్ట్రానిక్స్ ఇంజనీర్




కజూ హిరో ఫ్యూచీ, అయన సహచరులూ 1990 లలో వాడుకలోకి రాబోయే అయిదో తరం కంప్యూటర్‌లను డిజైన్ చేసే కార్యక్రమంలో ప్రస్తుతం నిమగ్నులై ఉన్నారు.

అతి వేగంగా పని చేసే 'తెలివి' యంత్రాల తయారీలో 10 ఏళ్ళలో ప్రపంచంలోని అగ్ర రాజ్యాలలో ఒకటి కావడం తన జాతీయ ధ్యేయంగా జపాన్ నిర్ణయించుకుంది. మనుష్యులు క్లిష్టమైన సమస్యలను కూడా పరిష్కరించేందుకు వాడుక చేసే అనుభవ సూత్రాలను ఉపయోగించే నేర్పును 'ప్రోలాగ్' (prolog - programming in logic) అనే భాష సాయంతో కొత్తగా డిజైన్ చేయబోయే ఆ యంత్రాలకు అలవరుస్తారు.

తను నిర్మించబోయే అయిదోతరం కంప్యూటర్‌లలో సాధించాలని ఫ్యూచీ నిర్ణయించుకున్న ధ్యేయాలలో కొన్ని:

1. పదివేల మాటలను నిలువ చేసి, చాలా మంది కంఠ స్వరాలను గుర్తిస్తూ, వారు డిక్టేట్ చేస్తే టైప్ చేయగల కంప్యూటర్‌లను తయారు చెయ్యడం,

2. 1,00,000 చిత్రాలను వేర్వేరుగా గుర్తించగల ప్రజ్ఞతో జపాన్ వారి చిత్రాకార లిపిని చదువ గల కంప్యూటర్‌లను నిర్మించడం,

3. యాంత్రికంగా అనువాదం చేసే కంప్యూటర్‌ని కనిపెట్టడం. జపానీస్ రచనలను ప్రపంచంలోని ఇతర ప్రధాన భాషలన్నిటిలోకీ అనువదించగల ఈ అనువాదక కంప్యూటర్ 90 శాతం దాకా కరెక్ట్‌గా అనువదిస్తుంది. తక్కిన 10 శాతం మానవ మేధనుపయోగించి సవరించవలసి ఉంటుంది.

('టైమ్' పత్రిక సౌజన్యంతో)

## ఇండియా తయారు చేసిన 'సూపర్ కంప్యూటర్'

మొట్టమొదటి సారిగా ఇండియాలోనే పూర్తిగా తయారైన కంప్యూటర్‌కి 'సూపర్ కంప్యూటర్' అని పేరు పెట్టారు. బహువర్ణ చిత్రణ, ముద్రణ సౌకర్యాలు గల ఈ కంప్యూటర్ వెల రూ 3 లక్షలు.

"చక్కని ఆలోచనలు ఆలోచించే వారికంటె సుఖపడేవారు లేరు."

# 'గొడుగు' పుట్టుపూర్వోత్తరాలు

ఎండకూ, వానకూ రక్షణగా సాధారణంగా వాటర్ ప్రూఫ్ గుడ్డను ముడవడానికి వీలైన ఒక ఊచల చట్రంమీద పరచి దానిని ఒక కర్రకు బిగించి చేతిలో పట్టుకుపోవడానికి



వీలుగా తయారుచేసిన ఒక పరికరం గొడుగు. ప్రాచీన కాలంలో గొడుగులకు 'ఆయిల్ క్లాత్' వాడేవారు. కాలక్రమేణ సిల్క్, నూలు, రేయాన్, నైలాన్ గుడ్డలు వాడడం మొదలుపెట్టారు. ఆదిలో ఒక ఊచల చట్రానికి వెదురో, పేమో వాడితే వాటి స్థానే ఇప్పుడు స్టీల్, అల్యూమినియమ్ ఊచలు వాడుకలోకి వచ్చాయి.

ఇంగ్లీష్‌లో గొడుగుని 'అంబ్రెల్లా' అంటారు. 'అంబ్రెల్లా' అనే ఈ మాట ఇటాలియన్ పదం 'ఓంబ్రెల్లా - కొద్ది నీడ' అనే మాటనుంచి వచ్చింది.

అతి ప్రాచీన కాలంనుంచీ చైనా, బర్మా, ఇండియా వంటి ఆసియాలోని దేశాలలో 'ఛత్రం' (గొడుగు) సార్వభౌమాధికారానికి చిహ్నంగా వాడబడడం ఉండేది. చైనాలో 'హాన్' వంశంవారి ఉబ్బెత్తుశిల్పాలలో 'చౌ' వంశపురాజు 'చెంగ్' తలమీద గొడుగు ఉన్నట్టు మలచబడింది. బర్మాలో రాజుగారికీ,

(మిగతా 4౫ వ పేజీలో)

## స్థూలకాయులు తినుబండా రాల వైపు చూడరాదు

బాగా ఒళ్ళు వచ్చి బరువు తగ్గించుకోవా లనుకునే వారికి 'యేల్' (అమెరికా) యూనివర్సిటీకి చెందిన డా॥ టామ్‌కూపర్ తినుబండారాల వైపు దృష్టి ప్రసరించ వద్దని సలహా ఇస్తున్నారు. ఘుమ, ఘుమలాడే తినుబండారాలు కంటబడగానే వారి జఠరంలో రసాలు ఊరి ఇన్‌స్యులిన్‌ని ఎక్కువగా తయారు చేసి రక్త ప్రవాహంలోకి పంపుతాయనీ, ఆ ఇన్‌స్యులిన్ వల్ల అంతకు ముందు తిని జీర్ణం చేసుకున్న ఆహారం కొవ్వుగా మారుతుం దనీ ఆయన వాదం!

"ఖగోళా లన్నీ రాలి కూలిపోయినా
ఒక్కసారి మాత్రమే నిన్ను చంపగలవు!" -కా[illegible]

# ఔషధ ప్రపంచం



## రాబీస్ వ్యాధికి కొత్త ఇంజక్షన్:

పూనె లోని 'ది సీరమ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా' (SII) కుక్క కాటు వల్ల వచ్చే 'రాబీస్' వ్యాధి నిరోధానికి బాధాకరంగాని ఒక తేలిక ఇంజక్షన్ కనిపెట్టింది. బొడ్డు చుట్టూ చేసే 14 ఇంజక్షన్ల కోర్సులాగా ఇది బాధ కలిగించదు. మానవులలోని 'జంట కణం' (diploid cell) నుంచి తయారైన ఈ వాక్సిన్‌ని చేతికే 3 సార్లు ఇంజక్షన్లుగా ఇస్తారు.

* * *

## బట్టతల మీద జుట్టు మొలిచే ఉపాయం:

'రోమ్' నగరం (ఇటలీ) లో జరిపిన పరిశోధనల వల్ల మధ్య తరహా లేసర్ కిరణాల ప్రసారంతో బట్టతల మీద తిరిగి వెంట్రుకలు మొలిచేట్టు చేయవచ్చు నని తేలింది. ప్రయోగాల వల్ల పుర్రె (sclap లో 3.5 మి మీ.ల లోపలికి లేసర్ కిరణాలు ప్రసరింప జేస్తే వెంట్రుకల మొదళ్ళలో తిరిగి పెరుగుదల ఆరంభం అవుతుం దని స్పష్టమైంది

* * *

## 'అంగ్జైటీ న్యూరోసిస్' కి ఆయుర్వేద చికిత్స:

'అంగ్జైటీ (ఆదుర్దా) న్యూరోసిస్‌ని ఆయు

---

## టిబెట్‌లో మిక్కిలి ముసలి ఫలవృక్షాలు

చైనా దేశపు వృక్ష శాస్త్రజ్ఞులు టిబెట్‌లో 1,000 పైచిలుకు సం. ల వయస్సు గల ఫల వృక్షాలను గుర్తించారు. ఒక వాల్‌నట్ చెట్టు 1,150 ఏళ్ళ నాటిది. మరో దానిమ్మ చెట్టు వయస్సు 810 ఏళ్ళు. ప్రపంచంలో మిక్కిలి పెద్ద వాల్‌నట్ చెట్టును వారు కనుగొన్నారు. దాని ఎత్తు 22.5 మీటర్లు. మొదలు చుట్టు కొలత 11.4 మీటర్లు. ఏటా ఆ చెట్టు నుంచి 200 కి గ్రా.ల వాల్‌నట్‌లు లభిస్తున్నాయి.

---

" 'నేను'తో నిండిపోయి ఉన్నవాడు ఎప్పుడూ ఖాళీ కుండే!"

ర్వేదంలో 'ఉద్వేగం' అంటారు. బెంగళూరు లోని ఆయుర్వేద పరిశోధన శాలలోని వైద్యులు ఈ వ్యాధికి ఆయుర్వేదంలో అమోఘమైన చికిత్స ఉందని ప్రకటించారు.

* * *

## హృద్రోగుల చికిత్సలో కొత్త ప్రక్రియ :

గొంతు నొప్పి (angina) తో కూడిన హృద్రోగులకు చికిత్స చేయడానికి 'ఆంజియో ప్లాస్టీ' అనే ఒక కొత్త ప్రక్రియను కని పెట్టారు. రక్త నాళాలలో ఏర్పడ్డ అవరోధాలను శస్త్ర చికిత్స అవసరం లేకుండా ప్రత్యేకంగా రూపొందించిన 'కాతెటెర్' అనే పరికరంతో ఈ ప్రక్రియలో తొలగిస్తారు.

* * *

## చర్మ వ్యాధుల నివారణకు లేసర్ కిరణాలు :

జపాన్‌లోని 'ఫకూయా' విశ్వ విద్యాలయంలోని కొందరు వైద్య నిపుణులు కాలి ఒరపిడి పుళ్ళు (athletes foot), తామర వంటి చర్మ వ్యాధులను అల్ట్రా వయొలెట్ కిరణాలు ప్రసరించే నైట్రజన్ లేసర్‌ల ద్వారా నయం చేస్తున్నారు.

(41 వ పేజీ తరువాయి)

ఆయన పట్టమహిషికీ తల మీద 12 మొదలు 15 అ.ల దాకా పొడువూ, 6 అ.ల వ్యాసం గల ఒక పెద్ద తెల్లని గొడుగు పట్టేవారు.



ప్రాచీన భారతీయ గాథలను తెలిపే 'కథా సరిత్ సాగరం'లో వివిధ చక్రవర్తులు ఛత్రధారులుగా వర్ణించబడ్డారు. ప్రాచీన భారతీయ శిల్పాలలోనూ, దేవతా విగ్రహాల లోనూ కూడా 'ఛత్రం' తరుచు కనిపిస్తుంది. ఈ 'ఉష్ణమండల' దేశాలలో రాజుగారికీ, దేవుడి విగ్రహాలకూ కూడా ఎండసోకకుండా గొడుగుపట్టే ఆచారం ఉండేది.

చైనాలో మామూలుగా వాడే గొడుగు వెదురును చీల్చి, దానిమీద వార్నిష్ వేసిన కాగితం పరచి తయారుచేసింది. ఈ రకం గొడుగులు చైనా, సింగపూర్, మలేషియా లలో నేటికీ వాడుకలో ఉన్నాయి.

ముడిచే గొడుగులు 14 వ శతాబ్ది నుంచే వాడుకలోకి వచ్చాయి.

"దుర్బలుడా! భయపడకు -
కీటకానికి ఏ దేవుడూ హానిచేయడు!" —ఎమర్సన్

# వీరిని గురించి తెలుసుకోండి



కోన్‌స్టాంటిన్ ఉస్టినోవిచ్ చెర్నెంకో: సోవియెట్ యూనియన్ అధ్యక్షులు; అక్కడి కమ్యూనిస్ట్ పార్టీకి కార్యదర్శి. క్రాస్నో యార్స్క్ ప్రాంతంలోని నోవోసెలోవో జిల్లా లోని 'బోల్షయా టెస్'అనే చిన్న గ్రామంలో 1911 సెప్టెంబర్ 24 న చెర్నెంకో జన్మిం చారు. 1930 - 33 మధ్య ఒక టీచర్స్ ట్రెయినింగ్ కాలేజ్ నుంచి పట్టభద్రు లయారు. 'మోల్డేవియన్ సోవియెట్ సోష లిస్ట్ రిపబ్లిక్'లో ఆర్థిక, సాంస్కృతికాభి వృద్ధి సాధించడానికే తన శక్తియుక్తు లన్నీ ప్రధానంగా ఆయన వినియోగించారు.

వెంగలిల్ కృష్ణన్ కృష్ణమీనన్: కళ్ళి కోటలోని ఒక సుప్రసిద్ధ న్యాయవాది కోమత్ కృష్ణ కురూప్ కుమారుడైన కృష్ణమీనన్ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. ఇంగ్లండ్‌లో ఉన్న కాలంలో బ్రిటిష్ లేబర్ పార్టీ ప్రముఖ సమర్థకులలో ఒకరు అయారు. ప్రపంచ శాంతి సాధనకు 'రాజనీతి' (diplomacy) ని ఒక పటిష్ఠమైన ఆయుధంగా వాడుక చేసి, కొరియన్, సూయెజ్ గడ్డు సమస్యలను పరిష్కరించడంలో ఆయన తోడ్పడ్డారు. భారత రక్షణ శాఖామంత్రిగా భారత సైన్యాన్ని ఆధునికీకరించేందుకు నిర్వి రామంగా కృషి చేశారు.

* * *

విక్టర్ బెనర్జీ: ప్రస్తుతం 34 ఏళ్ళ వయ స్సులో ఉన్న శ్రీ బెనర్జీ కలకత్తాలోని ఒక సుప్రసిద్ధ చలన చిత్ర నటుడు; కళాత్మక వస్తు సంగ్రాహకుడు. ప్రస్తుతం డేవిడ్ లీన్ తీస్తున్న ఇ. ఎమ్. ఫార్‌స్టర్ నవల 'ఏ పాసేజ్ టు ఇండియా' చిత్రంలో డా. అజీజ్ పాత్రను ఆయన పోషిస్తున్నారు.

*

అమీర్ ఖుస్రూ: ఉ. ప్రదేశ్ రాష్ట్రం లోని 'ఎటా' జిల్లాలో ఉన్న 'పాటియాలి'లో

(మిగతా 46 వ పేజీలో)

"ధర్మపరుడైన వాడికే 'మనశ్శాంతి' అంటే ఏమిటో తెలుసు!" —ఎపిక్యూరస్

# నిజాలు-నిదర్శనాలు

## ప్రజలలో ఎక్కువ మంది వద్ద తుపాకులు ఉన్న రాష్ట్రం:

ఇండియాలో 1975 లో ప్రజలలో 13 లక్షల మందికి మాత్రమే తుపాకి లైసెన్స్‌లు ఉండగా, 1982 మార్చి ఆఖరుకు ఆ సంఖ్య 22 లక్షలకు పెరిగింది. ఇండియాలోని రాష్ట్రాలలో ఈ విషయంలో హిమాచల ప్రదేశ్‌ది అగ్రతాంబూలం అక్కడ 6,71,073 మంది తుపాకీ లైసెన్స్ పొందిన వారున్నారు. ద్వితీయ స్థానంలో ఉన్న ఉ. ప్రదేశ్‌లో 5,70,603 మందికి తుపాకి లైసెన్స్‌లు ఉన్నాయి.

* * *

## కళాశాల విద్యార్థుల సంఖ్యలో పెరుగుదల:

యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్‌వారి 1982-83 వార్షిక నివేదిక ననుసరించి 120 యూనివర్సిటీలలోనూ, 13 యూనివర్సిటీలతో సమానంగా గుర్తింపబడిన సంస్థలలోనూ, 5,012 కాలేజీలలోనూ మొత్తం 31,36,986 మంది విద్యార్థులు ఉన్నారు. 1981-82 లో 118 యూనివర్సిటీలలోనూ, 13 యూనివర్సిటీ లాంటి సంస్థలలోనూ, 4 886 కాలేజీలలోనూ చదువుకొనే విద్యార్థుల సంఖ్య 29,50,000 మాత్రమే: అనగా ఒక్క ఏడాదిలో కళాశాల విద్యార్థుల సంఖ్య 6.3 శాతం పెరిగినట్టు:

* * *

## ప్రధాన రేవు పట్టణాలలో రద్దీ!

మన దేశంలోని ప్రధాన రేవుపట్టణా లైన

## ఎవరెస్ట్ శిఖర ప్రథమ విజేతలు



ప్రపంచం అంతటిలో మిక్కిలి ఎత్తైన ఎవరెస్ట్ శిఖరాన్ని (8,848 మీటర్ల ఎత్తు) మొట్ట మొదటి సారిగా 1953 మే నెల 29 వ తేదీ గం. 11-30 లకు అధిరోహించారు. న్యూజీలండ్‌కు చెందిన ఎడ్మండ్ పెర్సివాల్ హిల్లరీ, నేపాలీ షెర్పా టెన్సింగ్ నార్కే ఏక కాలంలో ఆ శిఖరాన్ని చేరుకున్నారు. మొట్ట మొదటి సారిగా ఎవరెస్ట్‌ను జయించిన ఆ పర్వతారోహక బృందానికి నాయకుడు కర్నల్ హెన్రీ సెసిల్ జాన్ హంట్.

"కార్యాచరణకు దారితీయని ఆలోచన ఆలోచన కాదు: అది పగటి కల!"

బొంబాయి, కలకత్తా, హాల్దియా, కొచ్చిన్, మద్రాసు, మార్మగోవా, న్యూ మెంగుళూరు, పారదీప్, టూటికొరన్, విశాఖపట్టణాలలో 1947-48 లో 1.6 కోట్ల టన్నుల ట్రాఫిక్ మాత్రమే ఉంటే. 1982-83 నాటికి అది 9 6 కోట్ల టన్నులకు పెరిగింది. అంటే మన రేవు పట్టణాలలో రద్దీ 6 రెట్లు పెరిగినట్టు! మనకు స్వరాజ్యం వచ్చేసరికి అయిదే ప్రధాన రేవు పట్టణా లుండేవి: బొంబాయి, కలకత్తా, కొచ్చిన్, మద్రాసు, విశాఖపట్టణం.

* * *

## 36 ఏళ్లలో 640 రిజర్వాయర్‌లు:

ఆనకట్టల నిర్మాణంలో ప్రస్తుతం ఇండియా ప్రపంచంలో 4వ స్థానంలో ఉంది. 1947 లో మనకు స్వరాజ్యం వచ్చిన తరువాత పెద్దవీ, మధ్యతరహావీ 1,000 ఆనకట్టలు నిర్మించే పని మనం చేబట్టాము. వాటిలో సుమారు 640 ఆనకట్టల నిర్మాణం ఇప్పటికి పూర్తి చేయగలిగాము.

* * *

## ఇండియాలో బొగ్గు నిలువలు:

"సెంట్రల్ మైన్ ప్లానింగ్ అండ్ డిజైన్ ఇన్‌స్టిట్యూట్" వారు జరిపిన సర్వే ననుసరించి ప. బెంగాల్, బీహార్ రాష్ట్రాలలో ప్రవహిస్తున్న దామోదర్, అజయ్, బారాకార్ నదుల క్రింద సుమారు 76.5 కోట్ల టన్నుల బొగ్గు నిలువలు ఉన్నాయి. ఆ ప్రాంతంలోని పట్టణాలు, గ్రామాలు, రోడ్లు, రైలుమార్గాల అడుగున మరొక 475 కోట్ల టన్నుల బొగ్గు నిలువలు ఉన్నాయి.

* * *

## ఇండియాలో సాలీనా రబ్బరు ఉత్పత్తి:

ఇండియాలో 2.5 లక్షల హెక్టేర్‌ల భూమి రబ్బర్ ప్లాంటేషన్‌ల క్రింద ఉంది. ఏటా మన దేశంలో 1,50,000 టన్నుల రబ్బరు ఉత్పత్తి అవుతూంది. అయితే సాలీనా మనకు 2,00,000 టన్నుల రబ్బరు కావాలి! రబ్బరు పండించే ప్రధాన రాష్ట్రాలు: కేరళ, కర్ణాటక, తమిళనాడు.

* * *

## ఇండియాలో సాలీనా చర్మాల ఉత్పత్తి:

ఏటా ఇండియా 10.5 కోట్ల పదనుచేసిన చర్మాలు ఉత్పత్తి చేస్తూంది. వీటిలో 4.2 కోట్లు పూర్తిగా పదను చేసినవి. తక్కినవి పాక్షికంగా పదను చేసినవి.

(44 వ పేజీ తరువాయి)

1253 లో జన్మించి. 1325లో ఢిల్లీ నగరంలో దేహం చాలించిన ప్రసిద్ధ ఉర్దూ కవి. సహజ సిద్ధమైన కవి అయిన అమీర్ ఖుస్రూ ఢిల్లీ లోని హజరత్ నిజాముద్దీన్ యోగి ప్రముఖ శిష్యులలో, అనుయాయులలో ఒకరు. ఆయన వ్రాసిన పద్యాలూ, పాటలూ ఇండియాలోనూ, పాకిస్తాన్‌లోనూ లక్షలాది స్త్రీ, పురుషుల నోళ్ళలో నేటికీ నానుతున్నాయి.

"ధర్మపరుల చేతలు గుబాళిస్తాయి!
వారి సమాధుల మీద పూలు పూస్తాయి!" —జె.పి. శ్లీ

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/- లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు)

1. టి. శృతి, 16 సం.లు, ఇంటర్ రెండవ సంవత్సరం విద్యార్థి, ఇ.డబ్ల్యు.ఎస్-40, ఎ.పి.హెచ్.బి.పి. (100 బిల్డింగ్స్), కాకినాడ—533 003.

కలం స్నేహం, సైకిలు తొక్కడం, నాట్యం.

2. టి. శివపాల్ సింగ్, 14 సం.లు, S/o టి. అమర్‌సింగ్, ఇం.నెం. 1-1-136, ఇదిగాం నిర్మల్ (ఆదిలాబాద్ జిల్లా).

మంచి పుస్తకాలు చదవడం, రేడియో వినడం, కలం స్నేహం.

3. కె. విజయ కృష్ణ, 13 సం.లు, C/o కే. హనుమంతరావు, శ్రీ విజయ ఆయుర్వేద నిలయం, ఎమ్.జి. రోడ్, కొత్తగూడెం—507 101 (ఖమ్మం జిల్లా).

కరాటే ప్రాక్టీస్, తపాలాబిళ్ళల సేకరణ, జోక్స్, కామిక్స్ చదవడం.

4. యన్ సుదర్శన్, 16 సం.లు, S/o యన్. సామ్యేల్, ఇం.నెం. 5-43, అంబారు పేట పోస్టు (నిజామాబాద్ జిల్లా) 503 126.

పెద్దలను గౌరవించడం, ప్రకృతి ఆరాధన, కలం స్నేహం.

5. కె. అశ్వనీ కుమార్ త్రివేది (కొండరాజు), డయిరీ ఫారమ్ రోడ్డు, చింతపల్లి—531 111 (వైజాగ్ జిల్లా).

## శత్రువుకు చిక్కకుండా పరుగెత్తే నిప్పుకోడి



ప్రపంచంలో మిక్కిలి పెద్ద సైజు పక్షి అయిన నిప్పుకోడి అవసరం అయితే గంటకు దాదాపు 80 కి.మీ.ల వేగంతో పరుగెత్తి, శత్రువుకు చిక్కకుండా తప్పించుకో గలదు. అది పోవడానికి వీలులేకుండా బంధిస్తే బలమైన దాని కాళ్ళతో ఒక్క తన్ను తన్ని అది మనిషిని కూడా చంపగలదు.

"మిడి మిడి జ్ఞానం కంటె అజ్ఞానం మేలు!" —నీషే

పాటలు పాడడం, కవిత్వం వ్రాయడం, డిస్కో డాన్స్ చెయ్యడం.

6. అనిల్ పాదల్, 16 సం.లు, ఇం. నెం. 1-7-1, జిరయోద్ నగర్, ఆర్మూర్ - 503 224 (నిజామాబాద్ జిల్లా).

చిత్రలేఖనం, కలం స్నేహం.

7. ఎమ్. శ్రీపాల్ రెడ్డి, బి.ఎస్‌సి, S/o డా॥ ఎమ్ ఆనంద రెడ్డి, ఇం. నెం. 1-1-106, జగత్యాల (కరీం నగర్ జిల్లా) 505 327.

కలం స్నేహం, ప్రకృతి పరిశీలన, పర్వతారోహణ.

7 ఇ శ్రీహరి రావు, 23. సం. లు, S/o సు బ్రహ్మణ్వేరరావు, ఇం.నెం. 12/117, గుడివాడ — 521 301.

కళారాధన, కలం స్నేహం, మూఢాచారాల విమర్శ.

9 కంభంపాటి సత్యనారాయణ మూర్తి, 82 సం.లు, హిందీ పండితుడు, ఇం. నెం. 6-5-98, 5/5 అరండల్ పేట పోస్టు, గుంటూరు — 522 002.

నిరంతర పుస్తక, పత్రికా పఠనం, సంఘ సేవ

10. ఎ. శేషు, 12 సం లు, 9 వ తరగతి విద్యార్థి, S/o రంగాచార్యులు, టీచరు, ఆం.ప్ర. గురుకుల పాఠశాల, కిన్నెరసాని డామ్ — 507 115 (ఖమ్మం జిల్లా).

రికార్డ్ డాన్స్ చేయడం, కథలు వ్రాయడం.

11 రామచంద్ర పట్నాయక్, 35 సం.లు, డుంగ్రి లైమ్‌స్టోన్ క్వారీ కాలనీ కాంపస్ పోస్టు (సంబల్‌పూర్ జిల్లా - ఒరిస్సా), 768 052.

సమాజ సేవ, ఫొటోల సేకరణ, పెయింటింగ్.

12 ఎమ్.డి. కాసిమ్, 17 సం.లు., S/o డి. రాజం, గబీర్‌పూర్ పోస్టు (మెదక్ జిల్లా) 502 108.

కలం స్నేహం, పుస్తకాలు చదవటం, రేడియో వినడం.

## వస్త్రాల మిల్లులో సౌరశక్తి వాడకం



అహమదాబాద్ (గుజరాత్) లోని జహంగీర్ టెక్స్‌టైల్ మిల్లులలో సౌరశక్తి ఉపయోగించి 6.000 లీటర్ల నీటికి, 2,000 కి.గ్రా.ల గాలికి 80° సెంటిగ్రేడ్ ఉష్ణోగ్రత కలిగిస్తున్నారు. వేడినీటిని కోరా గుడ్డలను ఉతకడానికి, వేడి గాలిని నూలునూ, గుడ్డలనూ ఆరబెట్టడానికీ ఉపయోగిస్తారు ఆ మిల్లుల డాబా మీద పరచిన 100 మెరుగు గాజు పలకలు సూర్యరశ్మిని ఆకర్షించి గాలినీ, నీటినీ వేడి చేయడానికి తోడ్పడుతున్నాయి.

"తెలియదని తెలియడం జ్ఞానానికి ప్రథమ సోపానం." - డి

# అద్భుతమైన కీటక ప్రపంచం

జె. బెనర్జీ

[శ్రీ జ్యోతిర్మయి బెనర్జీ ఒక స్వచ్ఛంద (Freelance) ఫొటోగ్రాఫరూ, రచయిత. సుప్రసిద్ధ ఇంగ్లీష్ పత్రికలు కెన్నిటికో తరచు వ్యాసాలు వ్రాస్తూ ఉంటారు. లండన్‌లో 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇన్‌కార్పొరేటెడ్ ఫొటోగ్రాఫర్స్' జరిపిన పరీక్ష ఆయన పాసయారు. తరువాత ఆ సంస్థలో 'అసోషియేట్' గా కూడా చేర్చుకోబడ్డారు.]

'క్రిమికీటకాలు' అనగానే మనలో చాలామందికి మన పంటలు పాడుచేసే చీడపురుగులు గుర్తొస్తాయి. నిజానికి—ఇప్పటి వరకూ మనకు తెలిసిన 7, 0,000 జాతుల కీటకాలలోనూ కొన్ని వందలు మాత్రమే మనిషికి అపకారం చేసేవి. తక్కినవి అనేక విధాలుగా మేలు చేసేవే! మనకు తెలిసిన కీటక జాతులే ఆధారంగా వాస్తవానికి ప్రస్తుత యుగాన్ని 'కీటకాల యుగం' అనవలసి ఉంటుంది. ఏమంటే- ఇంచుమించు ప్రతి చదరపు అంగుళం మేరలోనూ ఏదో ఒక కీటకం మనకు ఎదురవుతుంది.

వారం వారం తమ అస్థిపంజరాలను మార్చివేస్తూ ఉండే విచిత్రమైన జీవులు 'కీటకాలు!' చాలా కీటకాలు క్షణిక జీవులు. కొన్నిటికి నోరూ, పొట్టా కూడా ఉండవు. 15,000 మంది మానవుల కళ్ళలో ఎన్ని 'లెన్స్' లు ఉంటాయో, ఒక్క కీటకం కంటిలో అన్ని లెన్స్‌లు ఉంటాయి - అంటే 30 000 'లెన్స్' లన్న మాట! కొన్ని కీటకాలు అసహ్యంగానూ, భయంకరంగానూ ఉంటే, మరికొన్ని ఇంద్రధనుస్సంత మనోహరంగా ఉంటాయి. కీటకాలలో నేతపని, దర్జీపని, పశుపాలన, వడ్రంగం, యుద్ధం, గృహనిర్మాణం లాంటి



తేనెటీగ

## ఒలింపిక్ స్వర్ణ పతకం సాధించిన తొలి మహిళ

1900 లో మహిళల టెన్నిస్ సింగిల్స్‌లో విజయం సాధించి స్వర్ణపతకం గెలుచుకున్న బ్రిటిష్ మహిళ మిస్ చార్లెట్ కూపర్ ఒలింపిక్ పోటీలలో స్వర్ణపతకం సాధించిన తొలి మహిళ!

"దేనివల్ల మనిషి బ్రతుకుతాడో
దానికోసమే అతడు ప్రాణా లర్పించగలడు!"

అనేక కళలలో ఆరితేరినవే కాక, వాతావరణ సూచన చేసేవి కూడా ఉన్నాయి.

ప్రపంచంలో మొట్టమొదటి గాయని కీచురాయి (cricket). మొట్టమొదటి బెలూనిస్ట్



తూనీగ

సాలీడు. కాగితం తయారుచేసిన మొట్టమొదటి ప్రాణి కందిరీగ. హిమాలయ పర్వతాలంత ఎత్తైన ప్రదేశాల నుంచి ఆర్కిటిక్ ప్రాంతం అంత అతిశీతల ప్రదేశాల దాకా ఎక్కడ చూసినా మనకు కీటకాలు కనిపిస్తాయి. సముద్రమట్టానికి 18,000 అ. ల ఎత్తున కూడా కీటకాలు జీవిస్తాయి. భూగర్భ చీలికల (caverns) అడుగున ఉండే కీటకాలు పాలిపోయి, గుడ్డివై ఉంటాయి. 'మంచు పేను' (ice bug) జీరో డిగ్రీల పైన కొద్ది ఉష్ణోగ్రతలో జీవిస్తాయి. కొన్ని కీటకాలు వేడినీటి బుగ్గల తాలూకు బురదలో 120 డిగ్రీలు (ఫారన్‌హీట్) ఉష్ణోగ్రతను కూడా తట్టుకోగలవు. కొన్ని ఈగలు ఉప్పునీటిలో కూడా గుడ్లను పెట్టి సాకుతాయి. ఒక విచిత్రమైన కీటకం తన చిరుత ప్రాయంలో పెట్రోల్‌లో ఈదుతూ ఉంటుంది ఉపరితలం పైకి పొడుచుకుని వచ్చే ఒక గొట్టం ద్వారా అది గాలి పీలుస్తుంది.

ప్రపంచంలో ఉన్న మొత్తం కీటకాల సంఖ్య మనం నమ్మ శక్యం కానంత పెద్దది. ఒక అమెరికన్ కీటక శాస్త్రజ్ఞుడు పెన్సిల్వేనియా (అమెరికా) లో తను సర్వే చేసిన ఒక ఎకరం భూమిలోనే 13 పక్కన 13 సున్నాలు పెడితే వచ్చేటంత పెద్ద సంఖ్యలో కీటకాలు ఉన్నట్టు ప్రకటించాడు. ఒక బ్రిటిష్ కీటక శాస్త్రజ్ఞుడు మైదానాలలో ఒక ఎకరంలో 35 లక్షల కీటకాలను గుర్తించాడు. మనకు తెలిసినవే దాదాపు 10 లక్షల రకాల కీటకాలు ఉన్నాయి. పక్షులు, స్తనంధయ జంతువులు (mammals), చేపలు, సరీసృపాలు (reptiles) మొదలైన ప్రాణు లన్నిటి మొత్తం

## తొలి ఎలెక్ట్రానిక్ కలర్ కెమేరా

జపాన్‌లోని కెమేరాలు తయారు చేసే ఒక ప్రముఖ సంస్థ ఫిలిం అవసరం లేని మొట్టమొదటి ఎలెక్ట్రానిక్ కలర్ కెమేరాను నిర్మించింది. ఈ కెమేరా ప్రస్ఫుటమైన వర్ణ చిత్రాలను గ్రహించి, ఒక అయస్కాంతిక చక్రం (disc) మీద భద్రపరుస్తుంది. తిరిగి ఆ ఫొటోలను టీ.వీ. తెర మీదకు ప్రసారం చేయవచ్చును. ఆ బింబాల తాలూకు సంకేతాలను టెలిఫోన్ ద్వారా పంపించే ఒక ట్రాన్స్‌మిటర్‌ను కూడా ఈ కెమేరాలో అమర్చారు.

"కళ్ళలో దయా, మాటలలో నెమ్మదీ,
హ స్తస్పర్శలో మార్దవం అలవరచుకోండి!" —స్వామీ రామదాసు

సంఖ్య కంటె కీటకాల సంఖ్య 4 రెట్లు ఎక్కువంటే మీరు నిర్ఘాంతపోతారు. ప్రపంచంలో ఉన్న మనుష్యు లందరినీ ఒకవైపూ, కీటకాలను మరోవైపూ వేసి తూస్తే మనుష్యుల మొత్తం తూకం కంటె కీటకాల తూకం 12 రెట్లు ఎక్కువ ఉంటుంది.

రోజుకి 25 జాతుల కీటకాల పేర్ల చొప్పున నేర్చుకుంటూ పోతే, మొత్తం అన్ని కీటకాల పేర్లూ కంఠస్థం చెయ్యడానికి 60 ఏళ్ళు పడుతుంది. ఇంతవరకూ మనకు తెలిసిన కీటకాల జాతుల పేర్లన్నీ వ్రాయడం మొదలు పెట్టి ఎడతెరపి లేకుండా వ్రాసుకుంటూ పోతే ఆ పని పూర్తి చేయడానికి 6 నెలలు పట్టవచ్చు. జాతికి ఒక కీటకం చొప్పున ఒకదాని పక్కన ఒకటి వరుసగా పేర్చుకుంటూ పోతే ఆ వరుస సుమారు 8 మైళ్ళ పొడవు ఉంటుంది. అంతే కాక - ఈ కీటకాల జాతుల సంఖ్యకు ప్రతి ఏడూ మరి 6,500 కొత్త జాతుల కీటకాలు వచ్చి చేరుతున్నాయి.

శిలాస్థులు (fossils) గా లభించిన కీటకాల జాతులలో 4/5 వ వంతు నేటికీ మిగిలి ఉండడం అనంతమైన వాటి జీవశక్తి (endurance) ని చాటుతూంది. శిలాస్థులుగా దొరికిన కీటకాలలో ఒకటి తూనీగ (dragonfly). దాని పూర్వీకులు బొగ్గు మొదట ఏర్పడిన అతి ప్రాచీన కాలంలో ఆవిరులు వస్తున్న అడవులలో జీవించేవి. కొన్ని కోట్ల సంవత్సరాల క్రితం - ఆ రోజులలో - తూనీగల రెక్కల పొడవు 3 అ. ల దాకా ఉండేది. బహుశః ఈ భూమి మీద జీవించిన మిక్కిలి పెద్ద కీటకం అదే నేమో!

మన నిత్య జీవితాల మీద అనేక విధాలుగా

---

# రాజస్థాన్‌లో తవ్వుతున్న కాలువలు




రాజస్థాన్‌లో ప్రస్తుతం తవ్వుతున్న కాలువల తవ్వకం పూర్తి అయితే 3,900 లక్షల ఘ.అ. మట్టిని తవ్వి తీయడం జరుగుతుంది. ఈ మట్టిని ఒక దిబ్బగా పోస్తే అది ఎవరెస్ట్ శిఖరం అంత ఎత్తు ఉంటుంది. ఈ ప్రోజెక్ట్ క్రింద తవ్వే కాలువల మొత్తం నిడివి 9,425 కి మీ.లు. అంటే - మన దేశం పొడవు, వెడల్పు కలిపిన దూరం కంటె ఎక్కువ. ఈ కాలువల నిర్మాణంలో వాడుక చేసే ఇటుకలు సుమారు 340 కోట్లు. అన్ని ఇటుకలతో భూమధ్య రేఖ వెంట 8 మీ.ల వెడల్పున రోడ్డు నిర్మించవచ్చును.

('యోజన' సౌజన్యంతో)

"స్వతస్సిద్ధమైన ప్రతిభకు 'కృషి' మెరుగులు పెడుతుంది:
ప్రతిభా లోపాన్ని 'కృషి' పూరిస్తుంది." —సర్ జోషువా రేనాల్డ్స్

కీటకాల ప్రభావం కనిపిస్తుంది. చెదపురుగులు మన ఇళ్ళను గుల్లచేస్తాయి. 'దేశ దిమ్మరి చిమ్మెటలు' (gypsy moths) నీడ నిచ్చే మన చెట్లను ధ్వంసం చేస్తాయి. చీడపురుగులు (beetles) మన కూరల పాదుల్నీ,



ఈగ

మొక్కల్నీ పాడుచేస్తాయి. తోక పురుగులు (cloth moths) మన బట్టల్నీ, దుస్తుల్నీ కొట్టివేస్తాయి. ఇక మన పంటలకు ఎసరు పెట్టే చీడపురుగుల సంగతి సరే సరి!

అయితే - అన్ని పురుగులూ హానికరాలు కావు. మన ఆపిల్ తోటలకు మేలు చేసే కీటకాలు కొన్ని ఉన్నాయి. ఇక మనం వాడుకునే పట్టు వస్త్రాలు, తేనె, లక్క - అన్నీ పురుగుల చలువవల్లే మనకు లభిస్తున్నాయి. ఏడాదికి ప్రపంచంలో 6 కోట్ల పౌనుల లక్కను మనం వాడుక చేస్తున్నాము. 1,50,000 అతి సూక్ష్మ కీటకాలు 6 నెలలపాటు శ్రమిస్తే ఒక్క పౌను లక్క తయారవుతుంది. ఒక పౌను తేనెను ఉత్పత్తి చేయడానికి తేనెటీగలు ఇంచుమించు 40,000 పువ్వుల నుంచి మకరందం సేకరించుకు రావాలి. ఒక తేనెపట్టులో ఉండే తేనెటీగ లన్నీ కలిపి ఒక్కొక్కప్పుడు 2,50,000 పువ్వుల నుంచి కూడా మకరందం కొని రాగలవు. పువ్వులలోని మకరందం కేవలం ముడిపదార్థమే! దానినుంచి తేనెటీగలు తేనెను ఉత్పత్తి చేసే రాసాయనిక ప్రక్రియ ఇంతవరకూ మనిషికి అంతుపట్టలేదు. మనిషి ఇటీవలి కాలంలోనే తయారు చేయడం మొదలుపెట్టిన 'చల్లగా ఉండే రాసాయనిక దీపం' మిణుగురు పురుగులు ఏనాడో కని పెటాయి. మానవ జాతికి కీటకాలు చేస్తున్న

## మీరైతే....?

(అక్టోబరు - 1984)

దేవుడు కనిపిస్తే ?

"దేవ రహస్యం.... చెప్పకూడదు!"

—ఐ గోపాలకృష్ణమూర్తి,
పొన్నూరు (గుంటూరు జిల్లా).

* * *

"నేను మరో త్యాగరాజును అవుతాను!"

—చిక్కల విద్యాసాగర్,
అమలాపురం (తూ.గో. జిల్లా).

* * *

"వెంటనే కలియుగాంతం చేసెయ్య మంటాను!"

—టి. బాలకిషన్,
లింగగిరి (నల్గొండ జిల్లా).

"తెలివి లేని నిజాయితీ నిరుపయోగం: నిజాయితీ లేని తెలివి ప్రాణాంతకం!" —శామ్యూల్ జాన్సన్

అతి ప్రధానమైన సేవ ఒక పూవునుంచి మరొక పూవుకి పరాగాన్ని చేర్చి ఫలదీకరణా నికి సాయపడడం; ఆ విధంగా వృక్షజాతి వ్యాప్తికి తోడ్పడడం! పంటలకు స్వల్పంగా కీటకాలు హాని కలిగించే మాట నిజమే అయినా, కీటకాలు లేకపోతే అసలు పంటలే ఉండవు అనే మాట మనం గుర్తుంచుకో వాలి!

కీటకాల వల్ల నష్టాలూ, లాభాలూ, మన ఆర్థిక సంపదను పెంపొందించడంలో వాటి ప్రాధాన్యం అలా ఉండగా, వాటి జీవితాల లోనూ, అలవాట్లలోనూ కనిపించే వైచిత్రి కోసం ముఖ్యంగా కీటకాలను గురించి మనం తెలుసుకోవాలి. చేలలో, దొడ్లలో, పార్కు లలో, రోడ్ల ప్రక్కన - ఎక్కడపడితే అక్కడే కీటకాలు మనకు కనిపిస్తాయి. కొంచెం దగ్గిర నుంచి నిదానంగా పరిశీలించి చూస్తే అవి అన్నీ ఒకదాని కొకటి కార్బన్ కాపీల్లాంటివి కావనీ, దేని ప్రత్యేకత, దేని ఆకర్షణ దాని కుందనీ మనకు బోధపడుతుంది

పరిశోధనల వల్ల కీటకాలను గురించి ఆసక్తి కలిగించే విషయాలెన్నో తెలియ వచ్చాయి. కీటకాల రక్తం ఎర్రగా ఉండదు. ఆకుపచ్చగానో పసుపువన్నెగానో ఉంటుంది. తక్కిన ప్రాణులలో లాగ అల్లిబిల్లిగా అల్లు కున్న రక్తనాళాలు వాటి దేహాలలో ఉండవు. ముడుచుకుంటూ, సాగుతూ ఉండే గొట్టాల ద్వారా అలలు అలలుగా రక్తం వాటి దేహాల్లో ప్రవహిస్తుంది వాటి రక్తంలోని తెల్లకణాలు పాకీ పని చేయడమే కాకుండా, గాయమై రక్తం బయటికి వస్తే వెంటనే గడ్డకట్టించే బంకలాంటి పదార్థాన్ని కూడా ఉత్పత్తి చేస్తాయి.

---

## పరిపూర్ణ వికాసం చెందిన మానవ మేధ



మాక్స్ మ్యుల్లర్

" 'మానవ మేధ ఏ దేశంలోని ఆకాశం క్రింద అరుదైన తన శక్తులను అభివృద్ధి పరచుకొని పరిపూర్ణ వికాసం చెంది మానవ జీవన సమస్యలను ప్రగాఢంగా పరిశీలించి, ప్లేటో, కాంట్ దర్శనాలను అధ్యయనం చేసిన వారు కూడా తిరిగి ఆలోచించేట్టు చేసే అద్భుత పరిష్కారాలను సూచించింది?' అని ఎవరైనా నన్ను అడిగితే 'ఇండియా' వైపు నేను వేలు చూపిస్తాను."

—మాక్స్ మ్యుల్లర్

"పరీక్షించి గాని ఏ మనిషిని విశ్వసించకు:
విశ్వసించిన వాడికి నీ ప్రాణం ఇయ్యి!" -తిరుక్కురళ్

ఊపిరి తిత్తుల స్థానే కీటకాలలో దేహం అంతటా అల్లిబిల్లిగా అల్లుకున్న గాలి గొట్టాలుంటాయి. అవే ప్రాణ వాయువును దేహంలో అన్ని భాగాలకూ అందిస్తాయి. తూనీగ లాంటి ఎప్పుడూ ఎగురుతూ ఉండే కీటకాలలో అవసరానికి ప్రాణ వాయువును నిలువ చేసి ఉంచుకునే విడి గాలి తిత్తులు కూడా ఉంటాయి. మిణుగురు పురుగులో ప్రాణవాయువు 'లూసిఫెరిన్' అనే ఒక అసాధారణమైన కెమికల్‌ను ఉత్పత్తి చేస్తుంది. ఆ కెమికల్ నుంచే వెలుగు వస్తుంది. చెప్పుకోవలసిన ఒక సంగతి ఏమిటంటే - మనిషి కంటే వేగంగా కీటకాలు శ్వాసిస్తాయి. తూనీగ నిముషానికి 118 సార్లు గాలి పీలుస్తుంది.

కీటకానికి ఒకే 'మెదడు' కాదు. చాలా 'మెదడు'లు ఉంటాయి. శరీరంలో వివిధ స్థలాలలో నరాలు గుచ్ఛాలుగా ఏర్పడి, ఒక్కొక్కటి ఒక్కొక్క సందేశ ప్రసారక కేంద్రంగా ఏర్పడుతుంది. అలాంటి వేర్వేరు గుచ్ఛాలు వేర్వేరు చేష్టలను నియంత్రిస్తూ ఉంటాయి. చీమ తల తెగి పోయినా అది బ్రతికి ఉంటుంది; కదులుతూనే ఉంటుంది. తల లేకపోయినా ఇతర నాడీ గుచ్ఛాలు - ఆహారం లేక చనిపోయే దాకా-అది జీవించి ఉండేట్టు చేస్తాయి.

'కీటకాలకు 'మీసాలు' (antennae) చాలా బలమైన పరికరాలు. మనిషి యాంత్రికంగా తయారు చేసే పనిముట్ల కన్న అవి మరింత కచ్చితమైనవి. కొన్ని కీటకాలలో చెవులు, ముక్కు, జిహ్వ (నాలుక), చేతులు చేసే పను లన్నీ ఈ మీసాలే నిర్వహిస్తూ ఉంటాయి. కీటకాలు కొన్ని ఆహారాన్ని రుచి చూడడానికి తమ మీసాలను వాడితే, మరి కొన్ని అలికిడిని గుర్తించడానికి వాటిని ఉపయోగిస్తాయి.

కందిరీగలు కొయ్యను పొట్టు పొట్టుగా చేయడానికి తమ నోటిలోని అవయవాలను రంపంలాగ ఉపయోగిస్తాయి. 'అమోఫిలా' అనబడే కందిరీగ తన నోరు పట్టేటంత చిన్న

## వెల్లుల్లి చేసే మేలు



స్పెయిన్‌లోని 'వెల్లడోలిడ్' వైద్యశాస్త్ర పరిశోధకుల అభిప్రాయం ప్రకారం వెల్లుల్లి మనిషికి నాలుగు విధాల మేలు చేస్తుంది: 1. రక్తాన్ని శుభ్రపరచి, రక్తప్రసరణను క్రమబద్ధం చేస్తుంది, 2. నాడీమండలానికి మేలు చేసే వైటమిన్ 'బి' ని ఎక్కువగా సరఫరా చేస్తుంది, 3. 15 రకాల రోగకారక క్రిములను దరి జేరనీయకుండా 'ఆంటీ - బయొటిక్' గా పని చేస్తుంది, 4. ఇతర గ్రంథులను నియంత్రించే పిట్యూటరీ గ్రంథికి పుష్టి చేకూరుస్తుంది. అంతే గాక - రక్తంలో క్రొవ్వు పదార్థాలను అది తగ్గిస్తుంది.

"'మతం లేని వ్యక్తి కళ్ళెం లేని గుర్రంలాంటి వాడు!"—డా. ఎస్. రాధాకృష్ణన్

గులక రాతిని తను గుడ్లు పెట్టిన బొరియను మట్టితో కప్పేటప్పుడు సుత్తిలాగ వాడుక చేస్తుంది.

అద్భుతమైన కీటక జగత్తులో కీచురాళ్ళకు మన చెవుల లాంటి అవయవాలు కాళ్ళలో కనిపిస్తాయి. సీతాకోక చిలుకల జిహ్వేంద్రియం వాటి కాళ్ళలో ఉంటుంది. మనిషి కంటె 00 రెట్లు ఎక్కువ సూక్ష్మంగా సీతాకోక చిలుక పాదం చక్కెర రుచిని గ్రహించ గలదు. దోమ ముందు కాళ్ళు మానవ శరీరం నుంచి వెలువడే వేడిమి తరంగాలను గుర్తించ గలవు. అందుచేతనే చిమ్మ చీకటిలో కూడా అవి తమ ఎరను తేలికగా గుర్తిస్తాయి. తూనీగ కాళ్ళు అది ఎగరకుండా ఉండే కొద్ది క్షణాల సమయంలో విశ్రాంతి తీసుకోడానికి తప్ప వేరెందుకూ పనికి రావు. అయితే తట్ట లాగ అల్లుకున్న ఆ కాళ్ళు తూనీగ నీటి ఉపరి భాగాన ఎగురు తున్నప్పుడు ఆహారంగా చిన్న చిన్న క్రిములను పట్టడానికి కూడా తోడ్పడుతాయి. ఇతర కీటకాలను పట్టి తినే కీటకాల (preying mantis) ముందరి కాళ్లు ముళ్ళతో కూడి ఉండి, ఇతర కీటకాలను అతి వేగంగా వధించడానికి తోడ్పడుతాయి. ఒక్కొక్కప్పుడు తనతో జతకట్టిన ఆడ కీటకాన్నే - సమాగమం అయిన వెంటనే అతి చురుకుగానూ, తెలివిగానూ అది తప్పించుకొని పారిపోతే తప్ప - లేకపోతే ముందరి కాళ్ళతో పట్టి చంపివేస్తుంది.

కీటకాల రెక్కల బరువు తక్కువే అయినా వాటి బలం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అవి కదలడానికి ముఖ్యంగా మొండెం భాగమే ఉపయోగ పడినా వాటి రెక్కలు కూడా వాటి చలనానికి అద్భుతంగా తోడ్పడుతాయి. సగటున సెకనుకు ఒక తేనెటీగ రెక్కలు 190 సార్లూ, మామూలు ఈగ రెక్కలు 350 సార్లూ, కందిరీగ రెక్కలు 110 సార్లూ, తూనీగ రెక్కలు 28 సార్లూ కొట్టుకుంటాయి. తూనీగ జుమ్మంటూ సాధారణంగా గంటకు 25 మైళ్ళ వేగంతో ఎగురుతుంది. అవసరమైతే ఇంకా వేగంగా కూడా పోగలదు. వెనక్కూ, ముందుకూ కూడా అది ఎగురుతుంది. హెలికాప్టర్ లాగ నడి ఆకాశంలో ఎటూ కదలకుండా నిలబడనూ గలదు. దాని రెక్కలలో ఉన్న వేలాది రక్త నాళాల నుంచి దానికి ఈ ఎగిరే శక్తి వస్తుంది.

కీచురాళ్ళు ఒక రెక్కతో మరో రెక్కను రాసి సంగీతం పుట్టిస్తాయి. ఆ సంగీతంలో సెకనుకి వెలువడే స్వరాల సంఖ్యను బట్టి శాస్త్రవేత్తలు స్థానిక ఉష్ణోగ్రతను కచ్చితంగా లెక్క గట్ట గలరు. తేనెటీగలు తమ తేనెపట్టులను 'ఎయిర్-కండిషన్' చేసుకోడానికి తమ రెక్కలను ఉపయోగిస్తాయి.

కీటకాల పరిశీలన ప్రయోజనకర మైన ఒక మధురానుభూతి. మన బాల బాలికలు కీటకాలు కనిపించగానే అవి మన పంటలను పాడు చేస్తున్నా యనే కసితో వాటిని కాలి క్రింద వేసి రాయడం మాని, వాటి జీవిత నాటక సన్నివేశాలను ఆసక్తితో గమనించడం అలవాటు చేసుకోవాలి!

---

"ఒకే ఒక బోధనను చేయ మంటే -
నేను చేసే బోధ: 'గర్వ ఖండనం'!" —చెస్టర్‌టన్

# సాటిలేని ఆఫ్రికన్ ఏనుగు

చరిత్ర పూర్వ యుగం నాటి మిక్కిలి పెద్ద సైజు జంతువులైన 'మేమత్'లకూ, 'మేస్టడాన్' లకూ వారసులు మన ఏనుగులు.



ఒకప్పుడు ఈ భూగోళం మీద ఒక్క ఆస్ట్రేలియా తప్ప తక్కిన ఖండా లన్నిటిలోనూ దాదాపు 300 రకాల ఏనుగులు విహరిస్తూ ఉండేవి. ఆఫ్రికన్ ఏనుగూ, ఆసియా ఏనుగూ ఒకే మూలం నుంచి వచ్చినా, శారీరకంగా వాటిలో చాలా తేడాలు కనిపిస్తాయి భిన్న, భిన్న పరిసరాల కనుగుణంగా పరిణామం చెందడంలో వచ్చిన మార్పులు అవి

ఆఫ్రికాలో సహారా ఎడారికి దక్షిణాన ఏనుగులు ఎక్కువగా కనిపిస్తాయి. ఆసియా ఏనుగు 6 టన్నుల బరువే ఉండగా, ఆఫ్రికన్ ఏనుగు 7 టన్నుల బరువు తూగుతుంది. ఆఫ్రికన్ ఏనుగుల చెవులూ, కళ్ళూ బాగా పెద్దవి. వాటి తుండాల చివర ఆసియా ఏనుగులకు లాగ ఒకే గుబ్బ కాకుండా రెండు గుబ్బలు ఉంటాయి. ఆసియా ఏనుగులు లేత బూడిద రంగుగా ఉంటే. ఆఫ్రికా ఏనుగులు ముదురు గోధుమ వన్నెలో ఉంటాయి. వాటి తలలు వాలుగా ఉండి వీపు మీద మూపురం ఉంటుంది. వాటి కాలిగోళ్ళ సంఖ్య తక్కువ. ఆసియాలో ఇండియాలోనూ, ఆగ్నేయాసియాలోనూ మాత్రమే ఏనుగులు కనిపిస్తాయి. ఆఫ్రికన్ ఏనుగులు గడ్డి మాత్రమే తింటే, ఆసియా ఏనుగులు గడ్డితోపాటు కాయలూ, దుంపలూ కూడా ఆరగిస్తాయి. అన్ని రకాల ఏనుగులూ సాధు జంతువులే; వాటి శరీరం సైజు చూసి పెద్దపులులూ, సింహాలూ వంటి ఏ కొద్ది జంతువులో తప్ప తక్కినవి వాటి జోలికి రావు. ఏనుగు సంఘ జీవి. ఎప్పుడు చూసినా దాదాపు 100 ఏనుగులు గుంపుగా కలసి తిరుగుతూ ఉంటాయి. ఏనుగుల గుంపుకి ఆడ ఏనుగు నాయకత్వం వహిస్తుంది

---

## 9 వ ఏటనే పందెం గెలిచిన జాకీ!

గుర్రపు పందేలలో 1909-1912 మధ్య కాలంలో ఇంగ్లండు ఛాంపియన్ జాకీగా ఎన్నికైన ఫ్రాంక్ వూటన్ తన 9 వ ఏటనే మొట్టమొదటిసారి గుర్రపుపందేలలో విజయం సాధించాడట!

"దేనినీ కోరనివాడు సర్వోత్తముడు;
అతనికి ఆశాభంగాలు అంటూ ఉండవు!" —అలెగ్జాండర్ పోప్

# నవ్వు

## మీ పి.ఏ. పని చేస్తున్నాడుగా! :

మేనేజర్: "నేను బయటికి వెళ్ళా నని మా పి.ఏ. చెప్పాడుగదా! అయినా నేను ఆఫీసు లోనే ఉన్నా నని ఎలా అనుకున్నారు?

సేల్స్‌మన్: "మీరు నిజంగా బయటికి వెళ్ళి ఉంటే మీ పి.ఏ. అంత శ్రద్ధగా ఎందుకు పని చేస్తాడు సార్?"

* * *

## విడాకులకు కారణం :

ఒక యువ దంపతులు విడాకు లిప్పించ మని పెట్టుకున్న పిటీషన్ ఒక జడ్జిగారి ముందు విచారణకు వచ్చింది. జడ్జిగారు వయ స్సులో ఉన్న ఆ ఇల్లాలిని ఇలా ప్రశ్నించారు: "చూడమ్మాయి! ఈ యువకుడిలో ఏదో నిన్ను ఆకర్షించి ఉండాలి. లేకపోతే అసలు అతనిని పెళ్ళాడేదానివే కాదు గదా?"

"చిత్తం! ఆ మాట నిజమేనండి! కాని, అప్పుడు నన్ను ఆకర్షించిందంతా అతని దగ్గర ఇప్పుడు ఖర్చయిపోయిందండి!" అంది అతి వినయంగా ఆ ఇల్లాలు!

* * *

## ...టి గాథ :

ఒకే ఫ్యాక్టరీలో పని చేసే ముగ్గురు గుమా స్తాలు ఒక స్కైస్క్రేపర్‌లో ...వ అంత సులో ఒకే అపార్ట్‌మెంట్‌లో కలిపి ఉంటు న్నారు. ఒక రోజున ఫ్యాక్టరీ వదలగానే వారు తమ అపార్ట్‌మెంట్‌కి బయలుదేరారు. దుర దృష్టవశాత్తూ అవాళ ఎలివేటర్ (లిఫ్ట్) చెడి పోయింది. మెట్లెక్కి పైకి పోతూ అలసట కనిపించకుండా ఉండడం కోసం ఒకరు పాట పాడా లనీ, రెండవ వారు ఏదైనా జోక్ చెప్పా లనీ, మూడవ వారు ఒక కన్నీటి గాథ వినిపించా లనీ వారు నిర్ణయించుకున్నారు. మొదటి ఇద్దరూ తాము అన్నట్టు చేశారు. 99 వ అంతస్థు దగ్గిర పడింది. అప్పుడు మూడవ వాడు ఇలా అన్నాడు: "ఇదే నా కన్నీటి గాథ: మన అపార్ట్‌మెంట్ తాళం చెవి నేను ఫ్యాక్టరీలో మరచిపోయి వచ్చాను!"

* * *

## "ఇంకోసారి చస్తే ఈ పని చెయ్యను!" :

మొట్టమొదటి సారిగా తండ్రి అయిన ఒక వ్యక్తి న్యూస్‌పేపర్ ఆఫీసుకి ఫోన్ చేసి, గర్వంగా "నాకు కవల పిల్లలు పుట్టారు" అని చెప్పాడు. ఆ ఫోన్ కాల్ అందుకొన్న న్యూస్ పేపర్ ఆఫీసులోని అమ్మాయి సరిగ్గా విన పడక, "ఇంకోసారి - ఇంకోసారి...." అంది.

"నా వశంలో గనుక ఉంటే ఇంకోసారి ఇలాంటి పొరపాటు చస్తే చెయ్యను!" అన్నాడు ఆ కవల పిల్లల తండ్రి!

"స్వేచ్ఛ ఉన్న ప్రభుత్వం నిరంతరం మారుతూ ఉంటుంది!" —మాం టెస్క్యూ

# మీకు తెలుసా ?

తపాలా బిళ్ళ మీది కెక్కిన
మొదటి సినీమా తార:

మొట్టమొదట తపాలాబిళ్ళ మీదికెక్కిన సినీమా తార గ్రేస్ కెల్లీ. మొనాకో రాకుమారుడు 'రై సీర్'తో ఆమె వివాహానికి స్మృతి చిహ్నంగా 1956 లో ఆ తపాలా బిళ్ళను విడుదల చేశారు.

* * *

సురంగాలు తవ్వడంలో
అడవి ఎలుక ఘనత:

నేలలో బొరియలు తవ్వి వాటిలో నివసించే చిన్న కళ్ళూ, మెత్తని ఉన్ని గల ఒక జంతువు అడవి ఎలుక (mole). దాని పొడవు కేవలం 6 అంగుళాలే! అయినా అది ఒక్క రాత్రిలో 100 గజాల పొడవు సురంగం తవ్వగలదు.

* * *

రెండు ఖండాలలో
వ్యాపించి ఉన్న దేశం:

సముద్రంచేత వేరు చేయబడుతూ రెండు ఖండాలలో వ్యాపించి ఉన్న ఒకే ఒక దేశం తుర్కీ. ఆసియా, యూరప్ ఖండాలలో ఇది వ్యాపించి ఉంది.

తపాలా బిళ్ళ అంటించే పద్ధతి
కనిపెట్టిన ఘనుడు:

సుమారు 200 సం.ల క్రితం 'ఆర్ బ్రోత్' లో జన్మించిన జేమ్స్ చాల్మర్స్ అనే ఒక స్కాట్లండ్ దేశీయుడు ఉత్తరానికి ముందుగా డబ్బు చెల్లించి బిళ్ళకొని అంటించే పద్ధతిని మొదట కనిపెట్టాడు. తన 43 వ ఏట అలాటి స్టాంపు నమూనా ఒకటి అతడు తయారు చేశాడు.

('బి.బి.సి. - లండన్' సౌజన్యంతో)

* * *

మాంసాహారులలో ఘనాపాఠీలు:

ఉరుగ్వే (ద. అమెరికా) వాసులే ప్రపంచంలోని మాంసాహారు లందరిలో ఆరితేరిన వారు. అక్కడ సగటున ప్రతి వ్యక్తి రోజుకి 11 ఔన్సుల మాంసం లాగిస్తున్నాడు.

* * *

కారు నడుప నేర్చిన
తొలి రాజవంశీయుడు:

ఏడవ ఎడ్వర్డ్ పేరుతో అనంతరం బ్రిటిష్ రాజు కాకున్న ఆ నాటి 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్' 1899 లో మొదటిసారిగా కారు కొన్నాడు. అప్పటికి రాజవంశంలో కారు నడుప నేర్చిన వాడు ఆయన ఒక్కరే!

"ప్రభుత్వ భవనానికి బలమైన స్తంభం -
ధర్మాన్ని పాలించడం!" —జార్జ్ వాషింగ్టన్

# పోటీలు

డిసెంబరు 1984

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీ మీదా అడ్రసు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: డిసెంబరు **20, 1984**. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9. దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'ప్రేమ - పెళ్ళి' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. ఇండియాలో ఏ గుహల గోడల మీద

## ముఖచిత్ర వ్యా

(అక్టోబరు - 1984)

"బొట్టు లేని భారత స్త్రీ....
గట్టు లేని కాలువే సుమీ!!

—మొక్కపాటి విజయశ్రీ, సికింద్రాబాద్.

* * *

"ఇప్పుడు 'విస్డమ్' బొమ్మవు
కొన్నాళ్ళ కవుతావు బామ్మవు!!"

—అంకం ప్రేమ్‌సాగర్, నిర్మల్ తాలూకా.

* * *

"చిరు చిరు నవ్వుల చెల్లెమ్మా!
నీకు చిరు మెల్లక న్నుందమ్మా."

—కె. అన్నపూర్ణా దేవి,
సామర్లకోట (తూ. గో. జిల్లా).

---

"మోకరిల్లే పెద్దమనిషి కంటె నాగలి ముందు నిటారుగా నిలిచే రైతు ఉన్నతుడు!"

- బెంజమిన్ ఫ్రాంక్లిన్

ప్రాచీన వర్ణచిత్రాలు భద్రపరచబడి ఉన్నాయి? 2. అమెరికాలో వాడుకలో ఉన్న నాణెం ఏది? 3. సంస్కృతంలో 'అభిజ్ఞాన శాకుంతలము' నాటకాన్ని ఎవరు వ్రాశారు? 4. మదన్‌లాల్ ఇండియాలో ఏ క్రీడకు చెందిన క్రీడా కారుడు? 5. 'మిస్సైల్'ని తెలుగు పత్రికలు ఏమని అనువదిస్తున్నాయి? 6. ఇండియాలో రాష్ట్రాలలోని దిగువ సభను ఏమంటారు? 7. ఆకాశంలో చలనం లేకుండా స్థిరంగా ఉండే నక్షత్రం ఏది? 8. గోదా వ్రతాన్ని ఏ మాస వ్రతం అంటారు?

## పజిల్

ఆధారాలు - అడ్డం: 1. వివేకానంద స్వామి గురువు, 4. రామకృష్ణ పరమ హంస పత్ని, 6. తల్లి కిందులు చేసే కామము, 7. నీవు 'మాచిరాజు'—తప్పు, ఏది రైటు? 8. హస్తినా పురి, 10 బాగు + ఓగు, 11. ఒక ముస్లిం పండుగ, 13. అవసాన దశలో గొంతులో పుట్టే ధ్వని, 15. శిరస్సులో, 16. మణుల దొరికే గని, 17. 'విస్డమ్'తో ఆనందించే వాడు.

నిలువు: 1. రాధ, మాధవుడు నాయికా, నాయకులైన కావ్యం, 2. పాండవోద్యోగం నాటకానికి మరో పేరు, 3. తొలి మూడు ప్రథమా విభక్తి ప్రత్యయాలు, 4. మాంసాహారి కాని వాడు, 5. మందము, 8. చదరంగం బలంలో ఏనుగును ఎలుకలు ఈడ్చింది దీని లోనికా? 9. 'జవ్వాది' లాంటి పరిమళ



ద్రవ్యం, 12. ఆడ లేడి, 14 'రాక్షసుడు'కి వికృతి, 15. తృప్తి, 16. ఒక నక్షత్రం.

(4 వ పేజీ తరువాయి)

మనం చనిపోతున్నాం: 'చావు' ఒడిలో మనం జీవిస్తున్నాం. ప్రతి 'రోజూ' ఈ నిజాన్ని మనకు గుర్తు చేస్తూంది ప్రతి 'రోజూ' మన మృత్యు దినాన్ని ఒక అడుగు మనకు చేరువకు తెస్తూంది. దహనమో, ఖననమో చేయబడే ప్రతి శవం మనల్ని హెచ్చరిస్తూంది: "ఇవాళ నా వంతు, రేపు మీ వంతు!" అని. భావనా శీలి అయిన మనిషి కవి దృష్టిని అలవరచుకుని పూజా పుష్పాలతో పాటు తన జీవిత పుష్పాన్ని కూడా జగత్ ప్రభువు పాదాలవద్ద అర్పిస్తాడు.

"కాబట్టి తెలుసుకో నేస్తం!
క్షణికాలు మన జీవితాలు
'ప్రేమ' ఒకటే నిత్య సత్యం!
'మంచి'గా ఉంటూ, 'మంచి'నే చేస్తూ
'ప్రేమ'తో నవ్వుతూ బ్రతుకుదాం!
'శాంతి'తో హాయిగా వెళ్లిపోదాం!"

"చావంటే భయపడకు, ఆ క్షణం వస్తే కాని ఎవడూ చావడు!" -జరతుష్ట్ర

## తెలివికి పరీక్ష

1. 2, 5. 8, 11,— ఈ వరుసలో తరువాతి సంఖ్య ఏది?, 2. విడు—, —సరి ఒకే రెండక్షరాల పదంతో రెండు పదాలలోని ఖాళీలను పూరించండి. 3. ఐసెన్ హోవర్, కరియప్ప, ఝుకోవ్, నెల్సన్, చౌదరి—ఈ వర్గంలో ఇముడని వ్యక్తిని గుర్తించండి. 4 సంవత్సరం (        ) సమానమైన - బ్రాకెట్లకు ఇరువైపుల ఉన్న పదాల అర్థాలనూ బోధించే ఒకే పదంతో బ్రాకెట్లను పూరించండి, 5. కురుగబెం, చికరా, రంపుంవతరుతి. బొంయిబా, లత్తాకక—గజిబిజి అయిన ఈ నగరాలలో ఇండియన్ నగరం కానిది ఏది? 6 213 (222) 317; 548 (   ) 621 - సరియైన సంఖ్యతో బ్రాకెట్ ను పూరించండి. 7 కాశి, గయ, మదురై, కంచి, - (కుతుబ్ మినార్, శ్రీలంక, ప్రయాగ, ఖాట్మండు) బ్రాకెట్ లలో ఇచ్చిన ఏ పదం ఈ వరుసలో అతుకుతుంది? 8. ఎర్ర సముద్రంలోకి తెల్లని రాయి విసిరితే ఏమవుతుంది?

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి.

1. అనుష్టుప్పు: (ఏ) ఒక రకం ఉప్పు, (బి) ఒక ఛందస్సు, (సి) అనుష్ఠానం, (డి) అనురాగం.

2. అనుస్యూతం: (ఏ) ఎడ తెగనిది, (బి) సూతుడు చెప్పినది, (సి) సూతకం, (డి) ఒక రకం పుష్పం.

3 అనృతం: (ఏ) అప్పు. (బి) గానం, (సి) అబద్ధం. (డి) కృషి.

4. అనేకపం: (ఏ) సైన్యం అశ్వశాల, (సి) ఏనుగు, (డి) ద్వీపం.

5. అన్ను: (ఏ) సొగసు, (బి) అన్న భార్య. (సి) మరదలు, (డి) స్త్రీ

(8 వ పేజీ తరువాయి)

ఆయనను స్వదేశానికి పిలిపించాడు. కమ్యూనిస్టు చైనాతో అమెరికాకు యుద్ధాన్ని తెచ్చిపెట్టే విధానాలను మెక్ ఆర్థర్ తీవ్రంగా సమర్థిస్తూ ఉండడం వల్ల సైన్యాధిపతులందరి ఏకగ్రీవమైన అంగీకారంతోనే ట్రూమన్ ఆయనను అలా బర్తరఫ్ చెయ్యడం జరిగింది.

14 ఏళ్ళ తరువాత తన భార్యనూ, 13 ఏళ్ళ తన కుమారుడు ఆర్థర్ నూ వెంటబెట్టుకుని మెక్ ఆర్థర్ స్వదేశానికి తిరిగి వచ్చారు. 1937 లో టెన్నెసీ రాష్ట్రానికి చెందిన 'జీన్ ఫెయిర్ క్లాత్' అనే ఒక ధనిక యువతిని మెక్ ఆర్థర్ వివాహం ఆడారు స్వదేశంలో ఆ మహా సేనానికి వెళ్ళిన చోటల్లా వీరోచితమైన స్వాగతం లభించింది. గొప్ప వక్త కూడా అయిన మెక్ ఆర్థర్ ప్రతి సభలోనూ ట్రూమన్ పాలనలోని అవకతవకలను విమర్శిస్తూ మహోపన్యాసాలు చేశారు. 1964 లో ఆయన మరణించే వరకూ ఆయనను గూర్చిన వాదోపవాదాలు కొనసాగుతూనే వచ్చాయి.

"కర్తవ్య పాలన ఆత్మత్యాగం కాదు; మన మనుగడకు చేకూరే సార్థకత!"

6. అన్యాపదేశం: (ఏ) పరదేశం, (బి) అతిశయోక్తి, (సి) మరొక దానిని వ్యాజంగా చేసికొని వ్యంగ్యంగా చెప్పడం, (డి) పరిహాసం.

7. అన్వయం: (ఏ) వంశం, (బి) బ్రతిమిలాడుట, (సి) అనునయం, (డి) పదాల పొందిక.

8. అన్వేషణ: (ఏ) ఎదురు చూడడం, (బి) నిరీక్షించడం, (సి) ఎదురుకోలు, (డి) వెదకడం.

విస్డమ్
పోటీల కూపను
డిసెంబరు 1984

## ఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు ఖరీదు చేసే పుస్తకం బహుమతి!

## మీరైతే

'ఇండియా ప్రధాని అయితే...?'' మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పో




8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

"నా దృష్టిలో ఆకలినుంచి విముక్తే ఇండియాకు నిజమైన విముక్తి!' ంధీజీ

# పోటీలు (ఫలితాలు)

(అక్టోబరు 1984)

వ్యాసం - మొదటి బహుమతి: ఓ. జయశ్రీ ఒంగోలు; రెండవ బహుమతి: ఐ. సురేశ్వరరావు, వరంగల్; మూడవ బహుమతి; శ్రీమతి కె. హైమవతి, గుంటూరు.

క్విజ్ - జవాబులు: 1. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, 2. అన్యదేశీయులు అస్సాంలో వచ్చి స్థిరపడడం, 3. ఫ్రాన్స్ అధ్యక్షులు, 4. ముగ్గురూ కలపి (డి), 5. ఉత్తరప్రదేశ్, 6. వర్ధమాన దేశాలు, 7. 'మిషనరీస్ ఆఫ్ ఛారిటీ', 8. అమెరికాకు చెందిన ప్రముఖ టెన్నిస్ క్రీడాకారిణి.

విజేతలు - మొదటి బహుమతి: జి. రాధా రమణి, విశాఖపట్నం; మూడవ బహుమతి: ఎల్ వి. చలపతిరావు, పెద రావూరు (గుంటూరు జిల్లా).

పజిల్ - జవాబులు - అడ్డం: 1. కనకతార, 4. విశాఖ, 6. చకోరి, 7. సాగరశాయి, 8. తక్కెడ నోము, 10. రంగవల్లులు, 13. ముకురము, 15. నిటారుగ, 16. లలన, 17. నకులము, 18. నేపథ్యము.

నిలువు: 1. కళా సాగరం, 2. కత్తెర నావ, 3. రచయితలు, 4. విరి దండ, 5. ఖగోళము, 9. నోరార, 11. గరిటా?, 12. ల్లు, క, గ, ల, ము, 13. ముఖానవే! 14. ముద్గరము, 15. నిచ్చెన.

విజేతలు - మొదటి బహుమతి: పట్నం సౌదామిని, వెలుగోడు (కర్నూలు జిల్లా); రెండవ బహుమతి: శ్రేష్టి లక్ష్మీ శ్రీరామ చంద్రమూర్తి, జిల్లెళ్ళమూడి (గుంటూరు

## పాఠకుల అభిప్రాయాలు

(అక్టోబరు 1984)

"దయ్యం అంటే ఎందుకు భయం?
నీ మనస్సులో మెదిలే భయమే దయ్యం!"

—ఎస్. ఖాదర్ బాషా,
సుండుపల్లి (కడప జిల్లా).

* * *

"ముందు మానవ ప్రయత్నం చెయ్యి!
తరువాతే దైవము మీద భారం వెయ్యి!"

—పి. రవి ప్రకాష్,
పట్టికొండ (కర్నూలు జిల్లా).

* * *

"పై వానికి నమస్కారం
క్రింది వానికి తిరస్కారం—
ఇదీ ఈ నాటి సంస్కారం!"

—మట్టా అప్పలస్వామి,
దేవాది (శ్రీకాకుళం జిల్లా).

"ఉత్తమ గ్రంథం చేసే పని:
పాఠకుడిలో చురుకుదనం కలిగించడం!" —థామస్ కార్లైల్

జిల్లా); మూడవ బహుమతి: టి. నాగేశ్వర రావు, కళింగపట్టణం.

తెలివికి పరీక్ష - జవాబులు: 1. 'వు' ('ప్రతి వస్తువు' అనే మాట చివరి అక్షరం అదే గదా!), 2. జనార్దనుడు, 3. రెండు ఏనుగు లున్నప్పుడు, 4. 'పతి', 5. అర్థము, 6. లోలకులు (ఇది ఆభరణం, తక్కినవి సుగంధ ద్రవ్యాలు). 7. పాములకు ఈక లుండవు (సి), 8 21 (పూర్వ సంఖ్యల భేదానికి రెట్టింపు తీసివేస్తే తరువాతి సంఖ్య వస్తుంది).

విజేతలు - మొదటి బహుమతి: సి. నర సింహం, పెనుకొండ (అనంతపురం జిల్లా); మూడవ బహుమతి: ఎస్. భాస్కర్, ప్రొద్దుటూరు (కడప జిల్లా).

మాటల మహిమ - జవాబులు: 1. పార్వతి (బి), 2. ఒక నాయిక (ఏ), 3. పేరు లేని స్త్రీ (ఏ), ఉంగరపు వేలు (సి), 4. వలపు (బి), ఈతి బాధలలో ఒకటి డి), 5. ఉష భర్త (బి), మనస్సున కధిదేవత (డి), 6 అంగం లేనివాడు (బి), మన్మథుడు (డి), 7. సేన (సి), 8. జాలి (బి).

విజేతలు - రెండవ బహుమతి: రామి రెడ్డి సుజాత, విజయనగరం; మూడవ బహుమతి: 'రేమిళ్ళ'. హైదరాబాద్.

ముఖచిత్ర వ్యాఖ్య - మొదటి బహుమతి: మొక్కపాటి విజయశ్రీ, సికింద్రాబాద్; రెండవ బహుమతి: అంకం ప్రేమ్‌సాగర్, నిర్మల్ తాలూకా, మూడవ బహుమతి: కె. అన్నపూర్ణా దేవి, సామర్లకోట (తూ. గో. జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు - మొదటి బహుమతి: ఎస్. ఖాదర్ బాషా, సుండుపల్లి, (కడప జిల్లా); రెండవ బహుమతి: పి. రవి ప్రకాష్, పట్టికొండ (కర్నూలు జిల్లా); మూడవ బహుమతి: మట్టా అప్పల స్వామి, దేవాది (శ్రీకాకుళం జిల్లా).

మీరైతే? - మొదటి బహుమతి: ఏ. గోపాల కృష్ణమూర్తి, పొన్నూరు (గుంటూరు జిల్లా); రెండవ బహుమతి చిక్కాల విద్యా సాగర్, అమలాపురం (తూ గో. జిల్లా); మూడవ బహుమతి: టి బాలకిషన్, లింగ గిరి (నల్గొండ జిల్లా)

భావపరిచయ పోటీ - మొదటి బహుమతి: కె. జి నందగోపాల్, ఆళ్లగడ్డ (కర్నూలు జిల్లా); రెండవ బహుమతి: బి. హెచ్. పద్మిని, భట్టిప్రోలు (గుంటూరు జిల్లా); మూడవ బహుమతి: ఎమ్. ఎన్. మూర్తి, నెల్లుంట్ల (వరంగల్ జిల్లా).

## మిక్కిలి ప్రాచీనమైన బాంకు నోట్లు

ప్రపంచంలో తెలిసినంతలో మిక్కిలి ప్రాచీనమైన బాంకు నోట్లు చైనాలో 1369-1399 మధ్య మింగ్ వంశపు రాజుల పాలనలో జారీ చేసినవి అలాంటి మూడు నోట్లను ఇటీవల లండన్‌లో జరిగిన వేలంలో 670 పౌన్లకు కొన్నారు. ఒక్కొక్క నోటు పొడవు ఒక అడుగు మల్బరీ చెట్టు పట్టతో చేసిన కాగితం మీద ముద్రించిన ఆ నోటు విలువ ఒక 'క్వాన్!'

"'డబ్బు'ను మనం ఉంచుకోవచ్చు; కాని 'డబ్బు' మనల్ని ఉంచుకోకూడదు!"

